# ఆంధ్రప్రదేశ్

సంపుటి: 14 | జూలై 1970 | సంచిక లు : 9

ఆషాఢం_శ్రావణం 1892 శా.శ

ప్రధాన సంపాదకులు · పెండ్యాల వామనరావు




ముఖచిత్రం గొట్ట బ్యారేజి శంకుస్థాపన కార్యక్రమాన్ని చూడ వచ్చిన గిరిజన వనితలు_సంతోష తరంగాలలో

రెండవ అట్ట గొట్ట బ్యారేజిని తిలకిస్తోన్న గిరిజన భావి భారత పౌరుడు

మూడవ అట్ట రాజమండ్రివద్ద గోదావరి రమణీయ దృశ్యం

వెనుక అట్ట ర్యాలిలోని జగన్మోహినిస్వామి దేవాలయం

(ఫొటోలు . శ్రీధర్స్ ఆంధ్రప్రదేశ్ ప్రెస్ ఫొటో సర్వీస్)

వెల : 50 పైసలు

సాలు చందా 6 రూపాయలు

రిజిస్టర్డ్ నెం 135



పేజీ

# మేలెరుగని మే నెల

వేసవి ఎండలతో మల మల మాడించే మేనెల — నవభారత నిర్మాత శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ స్మృతులను మన మనస్సులకు ఆహ్లాదకరంగా అందిస్తుంది. ఆరేండ్ల క్రితం మే 27వ తేదీని ఆయన స్వర్గస్థుడైనాడు. ఈనాడు మనం విశ్వసిస్తున్న, అనుసరిస్తున్న కొన్ని ప్రాథమిక విధానాలకు ఆయన రూపురేఖలు దిద్దాడు; వాటికోసం కృషి చేశాడు. ఆనాటి "చారిత్రిక ప్రగతి శక్తుల"లో ఆయన ఒకభాగం. నూతనంగా వెలసిన జలవిద్యుత్పథకాలు ఉక్కు కర్మాగారాల వంటి "ఆధునిక దేవాలయాల"తో కూడిన నేటి నవభారతం ఆ మహనీయునికి ఎంతగానో ఋణపడి వున్నది. ప్రజాస్వామిక ప్రభుత్వాల చరిత్రలో, ఆయన వలె బహు రంగాలలో కృషిచేసి, అభివృద్ధి సాధించి, రాజకీయ, సాంఘిక ఆర్థిక వ్యవహారాలకు సంబంధించిన ఆలోచనా రీతులమీద గాఢముద్ర వేసిన వ్యక్తి మరొకరు లేరంటే అతిశయోక్తి కాదు. బానిస భారత దేశాన్ని, ప్రగతి ప్రయాణ సన్నద్ధమైన, శక్తివంతమైన స్వతంత్ర నవభారతంగా తీర్చిదిద్దిన ఘనత గాంధీ, నెహ్రూలదే. నెహ్రూ అంటే నిర్మొగమోటము, ధైర్యము, ఔదార్యము కలిగిన "ప్రజావాణి" అన్నట్లుగా ఆయన వ్యక్తిత్వం రాణించింది.

ఆంధ్ర రాష్ట్ర ప్రథమ ముఖ్యమంత్రి, ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు గారు నిర్యాణం చెందినది కూడా మే నెలలోనే. నెహ్రూకూ, ప్రకాశం పంతులుగారికీ కొన్ని గొప్ప గుణాలలో సామ్యం వున్నది. ఇద్దరూ "ప్రజల మనుషులు." ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినప్పుడు శ్రీ ప్రకాశం పంతులుగారు మొదటి ముఖ్యమంత్రి కావడానికి అవకాశం కల్పించినది నెహ్రూయే. అందువల్లనే రాష్ట్ర ప్రగతి యాత్ర సులభసాధ్యం అయింది. గత సంవత్సరం మే నెలలో అప్పటి రాష్ట్రపతి డాక్టర్ జకీర్ హుస్సేన్ పరమపదించారు. ఆయన మృతివల్ల ఏర్పడిన కొరత తీర్చరానిది.

ఈ యేడు మే నెల కూడా తన అఘాయిత్యపు లక్షణం మానలేదు. కేంద్ర ప్రభుత్వ న్యాయశాఖామంత్రి శ్రీ పి. గోవిందమీనన్ మరణం వల్ల భారత దేశం ఒక గొప్ప న్యాయవాదినీ పరిపాలనా దక్షుణ్ణీ కోల్పోయింది. అలాగే శ్రీయుతులు కోలవెన్ను రామకోటేశ్వరరావు, జి. ఎ. కృపానిధుల మరణంవల్ల పత్రికా ప్రపంచం పెద్ద దెబ్బతిన్నది. స్వయం ప్రతిభతో, ప్రత్యేక వ్యక్తిత్వంతో వీరుభయులు భారత దేశంలో జర్నలిజం అభివృద్ధికి ఎంతో దోహదం చేశారు. శ్రీ రామకోటేశ్వరరావు భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవన జ్యోతి చేతబట్టిన చేవగల రచయిత. సంస్కృతి, సౌకుమార్యమూ మూర్తీభవించిన విజ్ఞానవేత్త. శ్రీ కృపానిధి పత్రికా రచనా ధర్మ నిర్వహణ దీక్షా పరతంత్రుడు. "భారత దేశపు జర్నలిస్టు వీరయోధు"డని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారిచే పొగడ్తలు గొన్న ప్రతిభావంతుడు.

పార్లమెంటు ఉభయసభలలో తెలంగాణా సమస్య మీద జరిగిన చర్చల ఫలితంగా తెలంగాణా సమస్య ప్రధానంగా ఆర్థిక సమస్య అనీ, దానిని ఆ స్థాయిలోనే పరిష్కరించాలనీ, ఆంధ్రప్రదేశ్‌ను విభజించే ప్రసక్తే లేదనీ మళ్లీ ఒకసారి కేంద్ర ప్రభుత్వం స్పష్టంగా ప్రకటించడం జరిగింది. ఇంకొక రూపంలో, యింకో మాటల్లో చెప్పినప్పటికీ దేశంలోని పత్రికలు మొత్తంమీద యిదే అభిప్రాయాన్ని ఖచ్చితంగా వెల్లడించాయి. ప్రాంతీయ సంఘం అధికారాలను విస్తృత పరిచే ఉత్తరువు వల్లనేమి, తెలంగాణాలో సక్రమ అభివృద్ధికి దోహదం చేయడానికై కేంద్ర ప్రభుత్వం తీసుకున్న అనేక యితర చర్యల వల్లనేమి, జరిగిన లోటును సరిదిద్దుకోడానికే కాకుండా, ఐక్యతతో, దృఢనిశ్చయంతో ప్రగతివైపు పురోగమించడానికి ఆంధ్రప్రదేశ్ యిప్పుడు సిద్ధంగా వున్నది. నిజానికి ప్రాంతీయ సంఘానికి ఎక్కువ అధికారాలు యివ్వడం అనేది తెలంగాణా ప్రాంత అభివృద్ధి విషయాలలో అక్కడి ప్రజల మాట చెల్లే పరిస్థితి కల్పించడానికే ఉద్దేశించబడింది.

ప్రజాస్వామ్యం, సోషలిజం, మతాతీత లౌకిక వ్యవస్థ అనే మూడు ప్రధాన సూత్రాలు ఆధారంగా నవభారత నిర్మాణం జరుగుతున్నది. అయితే ప్రణాళికా బద్ధమైన అభివృద్ధి కృషే ప్రగతికి కీలకం. ఈ విషయాన్నే కేంద్ర ప్రభుత్వం ఘంటాపథంగా చెప్తున్నది; ఈ సందర్భంగానే తెలంగాణా సమస్యకు ప్రాధాన్యం వచ్చింది. తెలంగాణాలో, చారిత్రక కారణాల వల్ల చిరకాలంగా వున్న వెనుకబడిన తనమూ, అభివృద్ధి కార్యక్రమాలు వేగంగా జరుగని పరిస్థితుల వల్లనే తెలంగాణా సమస్య అంత స్పష్టంగా బైటికి వచ్చింది. రాష్ట్ర ప్రభుత్వమూ, కేంద్ర ప్రభుత్వమూ తీసుకుంటున్న చర్యలన్నీ తెలంగాణా ప్రాంతంలో సత్వర ఆర్థికాభివృద్ధి సాధనకు ఉద్దేశించినట్టివే. గత సంవత్సర ప్రణాళిక మొత్తం పెట్టుబడి రు 94.62 కోట్లలో, తెలంగాణాకు ప్రత్యేకంగా కేటాయించిన రు 9 కోట్లతో కలిసి మొత్తం తెలంగాణా ప్రణాళిక కేటాయింపు రు 44.77 కోట్లు. ఈ యేటి ప్రణాళిక మొత్తం రు 92 కోట్లలో తెలంగాణాకు రు 38,5 కోట్లు కేటాయించారు. గత సంవత్సరం ప్రత్యేకంగా తెలంగాణాకు యిచ్చిన రు 9 కోట్లు పూర్తిగా ఖర్చు జరగడం ఒక ముఖ్యవిశేషం.

-పి. వి. ఆర్.

# తెలంగాణా-ఆర్థికసమస్య

ఎ. వాసుదేవరావు

ఇటీవల రాజ్యసభలో తెలంగాణా సమస్యపై జరిగిన చర్చనుబట్టి అత్యధిక సంఖ్యాకవర్గ అభిప్రాయం ఆంధ్రప్రదేశ్ విభజనకు వ్యతిరేకంగా వున్నదనీ, తెలంగాణా ప్రధానంగా ఆర్థిక సమస్య అనీ, దీన్ని యీ దృష్టితోనే పరిష్కరించాలనే విషయం మరొకసారి రూఢి అయింది. యీ విషయాన్నే కేంద్ర ప్రభుత్వ దేశీయాంగ వ్యవహారాల సహాయ మంత్రి శ్రీ వి. సి. శుక్లా స్పష్టంగా చెప్పారు. తెలంగాణా ప్రజలకు న్యాయం చేయడానికి కేంద్ర ప్రభుత్వం దృఢవిశ్చయంతో ఉన్నదని వ్యక్తంచేశారు. చర్చల సమయంలో అత్యధిక సభ్యుల అభిప్రాయం ప్రత్యేక తెలంగాణా అవతరణకు మాత్రమేగాక మేమూయ రాష్ట్ర పద్ధతిలో ఉపరాష్ట్ర పతిపత్తికీ, అభిప్రాయ సేకరణకూడా వ్యతిరేకంగా ఉంది

## అపార నష్టం

ఈ చర్చ నేటి తెలంగాణా వాస్తవిక పరిస్థితిని ప్రతిబింబింప జేస్తున్నది. ప్రత్యేక తెలంగాణావాదులు హద్దుమీరిన చర్యలకు ఒడిగినారనీ, గత ఒకటిన్నర సంవత్సర కాలంలో ఆందోళన ఫలితంగా తెలంగాణా ప్రజలకు అపారనష్టం కలిగిందనీ యీ చర్చవల్ల ద్యోతకమవుతున్నది. కోట్ల రూపాయలనష్టం కలిగింది. ధన ప్రాణనష్టాలు కలిగాయి. వ్యాపారం దెబ్బతిన్నది. విద్యకు భంగం కలిగింది. తెలంగాణా ప్రాంతం అభివృద్ధికూడా చాలా వెనకబడింది.

## పూర్తిగా విఫలం

బహుళ ప్రచారంపొందిన పోరాటపు 'అంతిమ ఘట్టా'నికి ప్రజల సహకారం లభించలేదు. ఇది 'పూర్తిగా విఫలమైంద'ని పత్రికలు వ్యాఖ్యానం చేశాయి. న్యాయమైన కష్టనిష్ఠూరాలను తొలగించడానికి రాజ్యాంగ పద్ధతిలో కాక, ఆందోళనాయుతమైన చర్యలవల్ల ప్రజలకు ఏవగింపు కలిగిందని దీనివల్ల తెలుస్తుంది. తెలంగాణా ప్రాంతీయసంఘం ఉత్తరువును సవరణచేస్తూ, యీ సంఘానికి విస్తృతాధికారాలు కల్పించడంవల్ల, యీ ప్రాంతానికి ఒక కొత్త అవకాశం కలిగింది. తెలంగాణా ప్రాంతం అభివృద్ధికి ఇది చాల దోహదకారి అవుతుంది. రాజ్యసభ చర్చ సందర్భంలో తేలిన విధంగా భారత ప్రభుత్వం ప్రకటించిన అనేక చర్యలు అమలుపరచడానికి అవకాశమివ్వాలి. ఇవి నిస్సందేహంగా తెలంగాణా ప్రజల అవసరాలను తీర్చగలవు. మొత్తంమీద యీ ప్రజల కోరికలను తృప్తిపరచగలవు

## ముఖ్యమంత్రి ఘన విజయం

ప్రత్యేక తెలంగాణా వాదులు ప్రస్తుత పద్ధతులను విడిచి పెట్టాలని జాతీయ దినపత్రికలు సలహా యిచ్చాయి. ప్రత్యేక తెలంగాణా రాష్ట్రమే తెలంగాణా సమస్యకు పరిష్కారమార్గమని వాదించడం ఉద్యమానికి హానికలిగిస్తుంది. విద్యార్థులు తరగతులను బహిష్కరించాలని మళ్లీ మళ్లీ వాళ్లను ప్రోద్బలం చేసినట్లయితే, వారు దీనికి అంగీకరించరు. టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రిక ఇలా వ్యాఖ్యానించింది 'ఇటీవల శాసనసభలో విశ్వాస తీర్మానంలో ముఖ్యమంత్రి ఘన విజయం సాధించిన తరువాత, ప్రత్యేక వాదుల సవాలును ఎదుర్కొనడానికి ఆయనకు బలం చేకూరింది. మొత్తం శాసన సభ్యులలోనే కాక, తెలంగాణా ప్రాంతానికి చెందిన 100 మందికి పైగాగల శాసన సభ్యులతో కూడా ఆయన అత్యధిక సభ్యుల విశ్వాసాన్ని చూరగొన్నాడు. మరొక జాతీయ దిన పత్రిక ఇలా వ్రాసింది. 'రక్షణలను తిరస్కరించి భారత ప్రభుత్వం తీసుకొన్న చర్యలు నిష్ప్రయోజనమైనవనీ చెప్పి, ప్రత్యేక తెలంగాణా కొరకు ఆందోళనను తిరిగి కొనసాగించటంలో అర్థం లేదు. ప్రత్యేక తెలంగాణా వాదులు తప్ప ఇతరులు ఎవ్వరూ దీనిని హర్షించరు.'

తెలంగాణా ప్రజలకూ వారి అభివృద్ధికీ ఇప్పుడు ఉన్న యీ అనుకూలమైన వాతావరణం గత ఒకటిన్నర సంవత్సరంలో ఎప్పుడూ ఏర్పడలేదు.

## అభివృద్ధి నిరోధక నినాదం

నిష్ప్రయోజనకరమైన ఆందోళనలో ప్రోద్బలంతో పాల్గొనడంవల్ల విద్యార్థులు తమ తప్పును తెలుసుకొన్నారు. అనేక విధాలుగా వారు నష్టపడిపోయారు. రైతులు, వ్యవసాయ కూలీలు, పట్టణంలో కార్మికులు, ఇతర వృత్తి పనివారలు

ఎవ్వరూకూడా ఎప్పుడుకూడా విధ్వంసక ధోరణులను ప్రోత్సహించలేదు. ప్రస్తుత రాష్ట్ర సమైక్యతకు భంగం కలిగించలేదు. ముస్లింలు, ఇతర అల్పసంఖ్యాక వర్గ ప్రజలు యీ ఆందోళనకు దూరంగా ఉండిపోయారు. వారు సమైక్యతను బలపరిచారు. సమైక్య రాష్ట్రంలోనే వారికి భద్రత ఉందనీ, అభివృద్ధికి విశేషావకాశాలున్నాయనీ భావించారు. తెలంగాణాలోని వెనుకబడిన తరగతుల ప్రజలు, హరిజనులు, పలుకుబడి కలిగిన అల్పసంఖ్యాక వర్గాలతో కలిసి దౌర్జన్యపూరితమైన ఆందోళనలో పాల్గొనడంవల్ల తమకు శ్రేయస్సు ఉండదని వారు గుర్తించారు. పలుకుబడిగల యీ అల్పసంఖ్యాక వర్గీయులు ఇదివరకటి లాగానే ఇకముందుకూడా తమపై ఆధిపత్యం చెలాయిస్తారని వారు గుర్తించారు. ఇటీవల హైదరాబాదు నగరంలో రైతాంగం కనీవినీ ఎరగనంత భారీ యెత్తున పెద్ద ఊరేగింపు జరిపి రాష్ట్ర సమైక్యతకు నినాదాలు చేసిన దాన్నిబట్టి చూస్తే ప్రజలు ఏవైపు మొగ్గుతున్నారో నిస్సందేహంగా తెలియగలదు. జాతీయ సమస్యలపట్ల మార్క్సిస్టు నాయకుడు శ్రీ సుందరయ్యకుగల అభిప్రాయాలపట్ల ఇతరులకు విభేదాలుండవచ్చు. ఐతే ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం కొరకు చేసే ఆందోళన అభివృద్ధి నిరోధకమైనదనీ, ఫ్యూడల్ పెత్తనాన్ని పునః ప్రతిష్ఠాపించడానికి ఇది ఒక యత్నమనీ, ఆయన చెప్పినదానిని ఎవ్వరూ కాదనజాలరు.

## ప్రాంతీయ సంఘానికి విస్తృతాధికారాలు

తెలంగాణ మిగులునిధుల విషయమై సుప్రీంకోర్టు న్యాయమూర్తి అధ్యక్షతన ఏర్పడిన ఉన్నతాధికార సంఘం ఇచ్చిన తీర్పు దాదాపు కోర్టు తీర్పువంటిది. ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వం ప్రతిపాదనలవల్ల యింక ఊహాగానాలకు తావు లేదు. మొదట రాష్ట్ర ప్రభుత్వం మిగులు నిధుల విషయం పరిశీలించింది. ఆ తర్వాత భారత ప్రభుత్వ కంట్రోలర్, ఆడిటర్–జనరల్ నామినేటుచేసిన ఉన్నతాధికారి యీ విషయాన్ని పరిశీలించారు. ఆయన నిర్ణయం రాష్ట్ర ప్రభుత్వానికి అనంగీకార యోగ్యం కాలేదు. ఐతే తెలంగాణా ప్రాంతీయ సంఘం, సుదీర్ఘ చర్చలు జరిపిన తర్వాత మిగులు నిధులు ఇంకా ఎక్కువగా ఉండాలని చెప్పింది. ఈ ఉన్నతాధికారి నిర్ణయించిన అంకెలపట్ల అసంతృప్తి ప్రకటించింది. ఈ విషయంలో వొత్తిడి, భయాందోళనలను నివారించే ఉద్దేశంతో మిగులు నిధుల విషయమై మొదటినుంచి విచారణ చేయడానికి భారత ప్రభుత్వం విస్తృతాధికారాలతో సుప్రీంకోర్టు న్యాయమూర్తిని నియమించింది.

తెలంగాణా ప్రజల ఆకాంక్షలకు ప్రాతినిధ్యం వహిస్తున్నామని చెప్పుకుంటున్న వారిలో కొంతమంది వింత మనస్తత్వాన్ని ప్రదర్శిస్తున్నారు. పొసగని వాదాన్ని చేస్తున్నారు. ఇప్పుడు వారు సుప్రీంకోర్టు న్యాయమూర్తి యిచ్చిన తీర్పు తమకు సుముఖంగా లేదు. కాబట్టి దానిని కాదని లోగడ అధికారిచేసిన నిర్ణయంపట్ల మొగ్గు చూపుతున్నారు. ఒకవేళ ఆ అధికారి నిర్ణయించిన మొత్తంకంటే న్యాయమూర్తి నిర్ధారించిన మొత్తం ఎక్కువగా ఉండివుంటే ఆ అధికారికి రాజ్యాంగబద్ధమైన ప్రతిపత్తి లేదని వారు అనకుండా ఉండేవారా అని అనిపిస్తుంది.

మిగులు నిధులను గురించిన చర్చ నిరవధికంగా సాగడానికి వీలులేదనీ ఇది ఇంతటితో అంతంకావాలనీ అసమ్మతివాదులకు రాష్ట్ర ప్రజలు దేశ ప్రజలు ఘంటాపథంగా చెప్పాలి. తెలంగాణా ప్రాంతం అధికారాలు విస్తృతం చేయబడినాయి. ఉద్యోగనియామక విషయాలుకూడా సంఘం అధికారంలో ఉంటాయి. కనుక తెలంగాణా సమస్యలోని అతి జటిలమైన ఈ అంశాన్ని సమస్యను పరిష్కరించడానికి ఇది దోహదకారి అవుతుంది.

## అభిప్రాయ సేకరణ

ఒక్క సంవత్సరకాలంలో జరిగిన హింసాత్మకమైన ఆందోళన విఫలమైంది. విజ్ఞతలేకుండా ఆందోళన లేవదీస్తూ ప్రతి కొన్ని సంవత్సరాలకూ రాష్ట్రాల వ్యవస్థకు మార్పు తెస్తూవుంటే దానివల్ల దేశం ఛిన్నాభిన్నమైపోతుంది. దేశంలో శాశ్వతంగా అస్థిమితత్వం ఏర్పడుతుంది. విశాలాంధ్ర అవతరణకు అనుకూలంగా ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోవడానికి అయిదు సంవత్సరాల వ్యవధి యివ్వాలని రాష్ట్రాల పునర్నిర్మాణ సంఘం సూచన చేసిందన్న వాదన ఇప్పుడు అప్రస్తుతమైనది. ఎందుకంటే యీ ప్రతిపాదన చేయడానికిగల పరిస్థితులు ఇప్పుడు లేవు సమైక్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే అన్ని ప్రాంతాల అభివృద్ధి, ముఖ్యంగా తెలంగాణా అభివృద్ధి జరుగుతుంది ఆంధ్రప్రదేశ్ ఏర్పడి 14 ఏండ్లు అయింది. పూర్వపు హైదరాబాదు రాష్ట్రానికి చెందిన కొన్ని ప్రాంతాలు మైసూరు–మహారాష్ట్రాలలో చాలాకాలం క్రిందట విలీనమయ్యాయి. పూర్వపు హైదరాబాదు రాష్ట్రాన్ని యాథాతథంగా సాధించి తీరాలని అసమ్మతిదార్లు కోరితే అది వేరుమాట. అయితే మైసూరు మహారాష్ట్ర ప్రజలు దీనిని తీవ్రంగా ప్రతిఘటించగలరని వారికి బాగా తెలుసు.

ప్రజాస్వామ్య పద్ధతులద్వారా ప్రజాభిప్రాయన్ని సేకరించాలని చెప్పే పెద్దపెద్ద మాటలు తెలంగాణా ప్రాంతంలోవి ప్రస్తుతపు పరిస్థితికి వర్తించవు. వయోజన ఓటింగుతో కూడిన ప్రజాస్వామ్య విధానంవల్లనూ, తెలంగాణాకు చెందిక శాసన సభ్యులలో సైతం అత్యధిక సంఖ్యాకులు సమర్థిస్తున్నందు వల్లనూ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాగుతున్నది. ప్రజాభిప్రాయం ద్వారా హైదరాబాదు రాష్ట్రం భారత యూనియన్‌లో విలీనం కాలేదు మనదేశంలో భాషా ప్రయుక్త రాష్ట్రాలు కూడా యీ పద్ధతిలో ఏర్పడలేదు. యావద్భారత దేశ శ్రేయస్సు దృష్ట్యా ఇటువంటి చరిత్రాత్మక నిర్ణయాలు జరుగుతూ ఉంటాయి. ఈ పరిస్థితిని గోవాతో పోల్చడం హేతువాదంకాదు. ఎందుచేతనంటే గోవా విదేశప్రాంతం. భారతదేశంలో విలీనమైంది. ప్రజాభిప్రాయ సేకరణ వివాదం చాలా ప్రమాదకరమైనది. జాతిగా, దేశమునకు యిది ముప్పు కలుగజేస్తుంది. ఫలితంగా దేశం ఛిన్నాభిన్నమవుతుంది.

## చారిత్రిక దృక్పథం

ఉద్దేశపూర్వకంగా కానీ, ఇతర విధంగాకానీ అన్యాయాలు జరిగాయనే సాకుతో నాలుగు కోట్లతెలుగు ప్రజలు నివసించే సువి

శాల రాష్ట్రాన్ని విభజించాలని వాదన చేయడం వాంఛనీయంకాదు. సంప్రదాయకంగా చారిత్రికంగా, సాంస్కృతికంగా తెలుగు ప్రజలందరూ ఒక్కటే. చరిత్రలో చాలాకొద్దికాలం మాత్రమే విడిపోయి ఉన్నారు. చారిత్రక దృక్పథంతో చూసినట్లయితే ఇది చాలా స్వల్పమైన విషయం. చట్టరీత్యా ఎన్నికైన ప్రభుత్వం శాసన సభ్యుల విశ్వాసం కోల్పోయినట్లయితే అది పతనమవుతుంది అయితే విచ్ఛిన్నకర. విధ్వంసకర అల్పసంఖ్యాక వర్గాల దౌర్జన్యకాండను అరికట్టే విషయంలో ప్రభుత్వం తన బాధ్యతను విస్మరించజాలదు. ప్రజాస్వామ్యంలో అల్ప సంఖ్యాక వర్గాలవారు తమ అభిప్రాయాలను సమీకరించుకునేంతవరకు వేచి ఉండాలి. అప్పుడు వారు అధిక సంఖ్యాక వర్గంగా రూపొందవచ్చు. ఐతే నిజం చెప్పాలంటే రాష్ట్రాల స్వరూప స్వభావాలకు, సమైక్యత విభజనలకు సంబంధించిన విషయాలు ఒక ప్రాంతపు ప్రజాభిప్రాయ అధికృత ద్వారా నిర్ణయించబడజాలవు. ఇదే ఒకవేళ కొలమానంగా ఉన్నట్లయితే రాష్ట్రాలన్నీ ఛిన్నాభిన్నమైపోతాయి. ఆంధ్రప్రదేశ్ లోనే అయిదు రాష్ట్రాలు ఏర్పడవచ్చు.

తెలంగాణా నిర్లక్ష్యాన్ని గురించి గట్టిగా వాదిస్తున్నవారు ఆనాడు అధికారంలో ఉన్నకాలంలో అప్పటి నిజాం ప్రభుత్వం ప్రారంభించిన కొన్ని పరిశ్రమలను ప్రయివేటు పరిశ్రమదార్లకు అప్పగించారు. గతకొన్ని సంవత్సరాలలో తెలంగాణా ప్రాంతంలో ప్రభుత్వ రంగంలో రూ. వంద కోట్లు, ప్రయివేటు రంగంలో రూ. డెబ్బయి కోట్లు వెచ్చించడంవల్ల 30 వేలమంది స్థానిక ప్రజలకు ఉద్యోగాలు లభించాయి. ఇది గణనీయమైన విషయం. రామగుండంలో రూ. 75 కోట్ల ఖర్చుతో నిర్మించదలచిన ఎరువుల కర్మాగారం వల్ల పది పన్నెండు వేల మందికి ఉద్యోగాలు లభించే అవకాశం ఉంది. హిందుస్తాన్ కేబుల్స్ ఫ్యాక్టరీ స్థాపన. ఇంకా ఇతర అనేక చర్యల ఫలితంగా తెలంగాణా రూపురేఖలు మారుతున్నాయి. ఆందోళన ఫలితంగా కొంత వెనుకబడినప్పటికీ యీ ప్రాంతం పురోగమిస్తున్నది. తెలంగాణా శ్రేయస్సుదృష్ట్యేనూ, తెలంగాణా ప్రజల సంక్షేమం దృష్ట్యేనూ ప్రత్యేక రాష్ట్ర నినాదాన్ని విడువడం విజ్ఞత అనిపించుకుంటుంది. ప్రగతి పందెంలో వెనుకబడకుండా ఉండాలంటే ఇది అవసరము. ఇది ఎంత త్వరగా జరిగితే, ప్రజల దృష్టి అభివృద్ధి వైపుకు మళ్లితే అంత మంచిది.

అమూల్యమైన చాలా సమయం ఇప్పటికే వృధా అయింది. ప్రజాస్వామ్యంలో భేదాభిప్రాయాలు అసాధారణమైనవి కావు. అయితే యివి యీ ప్రాంతం అభివృద్ధికి ప్రతిబంధకం కాకూడదు. ప్రాంతం అభివృద్ధి అన్నది రాజకీయాభిప్రాయాలతో నిమిత్తం లేకుండా ఎల్లరూ, ఎల్లప్పుడూ హృదయపూర్వకంగా కోరవలసింది. కనుక మన అభిప్రాయాలు ఏవైనప్పటికీ, సంబంధాలు ఎటువంటివైనప్పటికీ మనందరము ఐక్య తో పాటుపడాలి. ★

## మరపురాని మన నెహ్రూ

నెహ్రూవలె సమకాలీన పరిస్థితులకు అనుగుణమైన వ్యక్తి మరొకరు లేరు. ఆయన వ్యక్తిత్వం చరిత్రలో ఒక ప్రత్యేకస్థానాన్ని పొందింది. ఆయన ఆదర్శాలు ఎన్నటికీ నశింపులేనట్టివి. ఆయన ఆదర్శాలను అనుసరించకపోతే జాతి బలహీనమైపోతుంది... ... ... మత కలహాల విజృంభణ సమయంలో జరిగినట్లు మతకలహాలనుగానీ, మరొక అరిష్టాన్నిగానీ ఎదుర్కోనడానికి జాతీయసమైక్యతా కార్యక్రమాన్ని ఉన్నతస్థాయిలో నిర్వహించవలసిన అవసరం వుంది. దీనికి అంగీకరిస్తే, నెహ్రూ యిచ్చిన సందేశంలోని ప్రధానభావాలను ఆమోదించినట్లే. ఆ సందేశ ప్రధానభావం ఏమంటే—ఆర్థిక ప్రగతియే జాతీయ సమైక్యతా సాధనకు అత్యంత దోహదకారి అని.

--ఎం. చలపతిరావు

(నేషనల్ హెరాల్ పత్రికలో)

### తెలంగాణా గురించి

# పత్రికల వ్యాఖ్యలు

## స్టేట్స్‌మన్

(మే 5)

హైదరాబాదులో రెండవ సారి ఆందోళన జరుపదలచుకొన్న తెలంగాణా వాదులు, నిర్దిష్టంగా ఏమి సాధించదలచుకొన్నారో దురూహ్యంగా వుంది. ఆందోళన జరిగిన మొదటి దశలో హైదరాబాదులోను ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర కొన్ని స్థలాలోలను యించుమించు సంవత్సరమువరకు జీవితం దుర్భరమైపోయింది. ప్రాణనష్టం జరిగింది, ప్రభుత్వ ఆస్తులు ధ్వంసమైనాయి. తత్ఫలితంగా భారీయెత్తున అరెస్టులు చేయడం తప్పనిసరి అయింది. ఇంత జరిగిన తరువాత కూడా ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర వాదుల గమ్యం ఇదివరకటి వలెనే సుదూరంగా పోయింది. తెలంగాణా ప్రాంత ప్రజలకు వాస్తవంగా కష్ట నిష్ఠూరాలు కలియగాయి, అనే విషయాన్ని న్యూఢిల్లీ కాదన లేదు. అంతేకాకుండా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సందర్భంలో తెలంగాణా ప్రజలకు ఇచ్చిన రక్షణలను తుచ తప్పకుండా అమలు పరచడానికి కేంద్ర ప్రభుత్వం తీసుకొన్న అనేక చర్యలను ప్రకటన చేసింది. ఈ చర్యలు ఏ విధంగా ప్రయోజనకారిగా వుంటాయో ఇంత త్వరగా నిర్ణయించడం సాధ్యంకాదు. ఎందుకంటే స్థానిక ప్రజలకు వేలాది సంఖ్యలో ఉద్యోగాలు కలిపించడం కాని లేదా అభివృద్ధి ఖర్చును అనువైన రీతిలో పంపిణీ చేయడంగాని ఏదో కొద్ది రోజులలో జరిగే పని కాదు. ఈ రక్షణలు నిష్ప్రయోజనకరమైనవని వాటిని త్రోసి పుచ్చి ప్రత్యేక తెలంగాణా రాష్ట్రానికి ఆందోళన చేయడానికి తెలంగాణా ప్రజాసమితి చేసిన నిర్ణయం అర్థ రహితమైనది– ఒక తెలంగాణా ప్రజాసమితి సభ్యులకు తప్ప ...

ఆంధ్రప్రదేశ్‌లో అంతర్భాగంగా వుంటూ తెలంగాణాకు ఇంకా ఎక్కువ స్వాతంత్ర్యం ఇవ్వాలా లేక ప్రత్యేక రాష్ట్రమే ఇవ్వాలా అనే విషయాన్ని ప్రజాస్వామ్య పద్ధతులలో రాజ్యాంగ బద్ధంగా నిర్ణయించవలసిన విషయం ఈ సమస్యను హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాల వీధులలో పరిష్కరించడం సాధ్యంకాదు.

## పేట్రియట్

(మే 6)

ప్రత్యేక రాష్ట్రవాదులు మరొక సారి తలపెట్టిన సామూహిక ఆందోళన పటాపంచలు కావడం చూస్తే తామే నాయకులమని పేరుపెట్టుకొన్నవారి లక్ష్యాలు ఆశయాల పట్ల ఈ ప్రాంత ప్రజలకు అపోహలు ఏర్పడినట్లు ద్యోతకమవుతున్నది. ఇందుకు కారణం సమితి యొక్క కార్య నిర్వాహకుల దుర్బలత్వం కావచ్చు లేదా పోలీసుల దమన నీతి కావచ్చు. కారణం ఏదైనా, ప్రత్యేకవాదులు వెనుకబడివున్న ప్రాంత ప్రజలను తమవైపు మళ్ళించుకోలేక పోయినారనేదినిజం. ఈ ప్రాంతపు ప్రాథమిక సమస్యలు ఇంకా పరిష్కారం కావలసివున్నాయి. కొన్ని నెలల క్రితం కేంద్రం ప్రపాదించిన సూత్రాలను తీవ్రంగా పరిశీలించడం ఇంత వరకు జరుగ లేదు. అడపా దడపా ఆందోళన సాగడమే ఇందుకు కారణం. ఈ సూత్రాలను అమలు పరచినట్లయితే అవి తెలంగాణా ప్రజల న్యాయమైన కోర్కెలను తీర్చగలవు. అయితే, ముందుగా ఆందోళనను నిలిపివేయడం అవసరం. లోక సభసభ్యులు, రాష్ట్ర నాయకులు ఈ విషయం పట్ల వెంటనే శ్రద్ధ వహించాలి

## ఇండియన్ ఎక్స్‌ప్రెస్

(మే 8)

ఆందోళన రెండవ దశ ముగిసిన తరువాత, సమితి నాయకులు మొదటి ఆందోళన అంతమైన తరువాత ఎక్కడ వుండినారో ఇప్పుడూ అక్కడేవున్నారు కొన్ని నెలల క్రిందట మొదటి దశలో జరిగిన దాని కన్న ఇప్పుడు చాల కొద్ది స్థాయిలో మాత్రమే యథావిధిగా ప్రభుత్వ ఆస్తికి నష్టం కలిగింది. అయితే, ఉపవాస దీక్షల కార్యక్రమం వల్ల అంత ప్రయోజనం లేదని సమితి నాయకులు తెలుసుకున్న తరువాత ఆందోళన యొక్క మూడవ దశ ఆరంభమవుతున్నదని చెబుతున్నారు. కొంత కాలం క్రిందట తెలంగాణా రక్షణలను అమలు పరచడానికి కేంద్రం ప్రకటించిన చర్యలను ఆచరణలో పెట్టడానికి ముందుగానే వాటిని ఖండించడం జరుగుతున్నది, ఆర్థిక రీత్యా గల కష్ట నిష్ఠూరాల ఫలితంగా ఉత్పన్నమై ఈ ఆందోళన ఇప్పుడు రాజకీయ దృష్టితో కొనసాగుతున్నదని దీనివల్ల ద్యోతకమవుతున్నది.

తెలంగాణాకు ప్రత్యేక రాష్ట్రం ఇవ్వాలనే ప్రశ్న లేనేలేదు ఉప రాష్ట్ర పతి పత్తి ప్రతిపాదన వల్ల, ప్రతి చోట ఇట్టి ఆందోళన ప్రబలే ప్రమాదంవుంది. గుజరాత్, మహారాష్ట్ర, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, మైసూరు వంటి రాష్ట్రాలలో ఇట్టి వాటికి అంతం వుండదు. ఇదే విధంగా ఉపరాష్ట్ర ప్రతిపత్తి వుండానికి ఇతర చోట్ల కూడా కోరిక ప్రబలవచ్చు.

కనుక ఇటీవలి కేంద్ర ప్రభుత్వ నిర్ణయాలు అమలు పరచడానికి అవకాశమివ్వడం చాల అవసరం.

## టైమ్స్ ఆఫ్ ఇండియా

(మే 7)

"పెడత్రోవ" అనే శీర్షికక్రింద యిలా వ్రాసింది :—

ప్రజాసమితి నాయకులు హైదరాబాదులోనూ, యితర పట్టణాలలోనూ తెలంగాణా ఆందోళనను కొనసాగించడం ద్వారా నిర్దుష్టంగా ఏమి సాధించదలచారో అవగతం గావడంలేదు. వారు యిటీవల చేపట్టిన తమ ఉద్యమ ఘట్టాన్ని, తెలంగాణాకు సంపూర్ణ రాష్ట్ర ప్రతిపత్తిని సాధించడానికై "తుది పోరాటం" అని ప్రకటించుకున్నప్పటికీ అది కాస్తా నీరు కారిపోయింది. గతవారంలో రాజధానిలో చెదురుమదురుగా మూకలు నిషేధాజ్ఞలను ఉల్లంఘించడం రోడ్లపై అడ్డంకులను నిర్మించడం. పోలీసు స్టేషన్లపై దాడులు జరపడం, బస్సులపై రాళ్లు రువ్వడం, పబ్లిక్ ఆస్తులను కాల్చడానికి ప్రయత్నించడం వంటి సంఘటనలు జరిగినమాట నిజమే. కాని ప్రజాసమితి అధ్యక్షుడు కానీ, ఆయన అనుయాయులు కానీ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం, గత సంవత్సరంలో మాదిరి తిరిగి తీవ్రస్థాయి నందుకుంటుందన్న భ్రాంతిలో పడరాదు...............
ఏమైనప్పటికీ, ఆంధ్రప్రదేశ్ విచ్ఛిత్తిని గట్టిగా వ్యతిరేకిస్తున్న ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి తెలంగాణా ప్రాంతంలో పెద్ద ఎత్తున వంతుల వారీగా నిరాహార దీక్షలను సాగించడం కొరకు తాము 6,000 శిబిరాలను ఏర్పాటుచేయగలమని ప్రత్యేక వాదులు చేసిన బెదరింపును బహుశః లక్ష్యం చేయకపోవచ్చు. నిరహార దీక్ష బూనడానికి అవసరమైనంత మంది వాలంటీర్లకు కూడా వారికి లభించకపోవచ్చు క్రిందటి నెల వారు ప్రారంభించిన యిటువంటి ఉద్యమం పూర్తిగా విఫలమైంది.

ముఖ్యమంత్రి ఇటీవల రాష్ట్ర శాసన సభలో తమ పై వచ్చిన విశ్వాసరాహిత్య తీర్మానాన్ని అత్యధిక సంఖ్యాబలంతో ఓడించిన తరువాత, ప్రత్యేక వాదులుచేసే ఎటువంటి కొత్త సవాలునైనా ఎదుర్కొనగలిగే స్థితిలోవున్నారు. ఆయన శాసన సభలో మొత్తంమీద మెజారిటీ సభ్యుల విశ్వాసాన్ని చూరగొనడమే కాకుండా, తెలంగాణా ప్రాంతానికి చెందిన సుమారు నూరు మంది శాసన సభ్యులలో సైతం అత్యధిక సంఖ్యాకుల విశ్వాసాన్ని పొందారు. అదేకాకుండా, తొలిదశలో ప్రత్యేకరాష్ట్ర ఉద్యమాన్ని ప్రారంభించిన ఈ ప్రాంత విద్యార్థులు యిప్పుడు, సమితి నాయకుల మధ్య కీచులాటలు జరుగుతుండడం వల్ల విసిగిపోయారు. నిజానికి ఈ విద్యార్థులలో చాలామంది తమ చదువులను కొనసాగించడం పట్ల ఆసక్తి చూపుతున్నారు. డా. చెన్నారెడ్డి ఆయన అనుయాయులు ఈ పరిస్థితులను గమనించి ఆందోళనకు సంబంధించిన తమ వ్యూహాలకు స్వస్తిచెప్పవలసిన సమయం వచ్చింది తరగతులను బహిష్కరించి, ఉద్యమంలో పాల్గొనడానికి విద్యార్థులను ప్రోత్సహించేందుకు తాము తిరిగి ప్రయత్నించినట్లయితే విద్యార్థుల విద్యావ్యాసంగానికి దెబ్బతగిలి, చివరకు అది, ఈ ప్రాంతం విద్యావిషయంలో వెనుక పడడానికి దారితీస్తుందన్న విషయాన్ని వారు తెలుసుకోవాలి. తెలంగాణా ప్రాంతీయ సంఘం అధికారాలను విస్తృతీకరించడం ద్వారానూ, చాలినన్ని నిధులను ఈ సంఘంపరం చేయడం ద్వారానూ తెలంగాణా, ఆంధ్రప్రాంతాలకు మధ్య అభివృద్ధి విషయంలోగల వ్యత్యాసాన్ని, తగ్గించడానికి కేంద్రప్రభుత్వం యిదివరకే చాలా చర్యలు తీసుకున్నది. ఈ చర్యలు ఫలప్రదం కావడానికై ప్రస్తుతం ప్రజాసమితి రాష్ట్ర ప్రభుత్వం వారితో మనః పూర్వకంగా సహకరించడానికి సిద్ధంగా లేక పోయినప్పటికీ, వీటిని అమలు జరిపి చూడవలసిన యితరుల మార్గంలో అడ్డునిలువరాదు. తెలంగాణా సమస్యకు విడిపోవడమే ఏకైక పరిష్కార మార్గమని పట్టుపట్టడం అసలు లక్ష్యానికే హాని కలిగిస్తుంది.

---

## రచయితలకు విజ్ఞప్తి

ప్రజలకు ఆసక్తికరమైన వర్తమాన పరిస్థితులను గురించి "ఆంధ్రప్రదేశ్" పత్రిక కోసం ప్రత్యేకంగా రాసిన రచనలు కోరబడు చున్నవి.

సాంఘిక,సాంస్కృతిక విషయాలను గురించిన రచనలూ, ప్రజలకు విజ్ఞాన ప్రదములైన రచనలు కూడా పంపవచ్చు. ప్రకటించిన రచనలకూ, ఫొటోలకూ పారితోషకం చెల్లించబడుతుంది.

పి. వామనరావు

"ఆంధ్రప్రదేశ్" పత్రిక ప్రధాన సంపాదకులు, సమాచార పౌరసంబంధశాఖ, హైదరాబాద్.

---

# తరాల తారతమ్యాలు

-- యం. వి. రాజగోపాల్

న్యూయార్కు నుంచి హానోలులూవరకు 6000 మైళ్ళకుపైగా వ్యాపించి అనేక విభిన్నత్వాలుగల దేశం అమెరికా సంయుక్త రాష్ట్రాలు. దీనిని గురించి కేవలం మూడు వారాల పర్యటనానుభవంతో వ్రాయబూనడం సాహసమే అవుతుంది. అమెరికాను గురించి క్షుణ్ణంగా తెలిసినట్లు సాధికారంగా చెప్పడం కూడా పొరపాటే అవుతుంది. అయినప్పటికీ, సరియైన స్థలాలను దర్శించడం, సరియైన పరిస్థితులలో సరియైన ప్రజలను కలుసుకొనే అవకాశం కలగడంవల్ల నేటి అమెరికన్ ప్రజలను ఎదుర్కొంటున్న పరిస్థితులను స్థూలంగానైనా కొంతవరకు తెలుసుకోవడం సాధ్యపడుతుంది. నేను అమెరికాలో పర్యటించినప్పుడు ఇట్టి సదవకాశం ఒకటి నాకు తటస్థించింది. మిచిగన్ రాష్ట్రంలో ఆన్ ఆర్బర్ విద్యార్థులు ఒక కార్యక్రమాన్ని నిర్వహించారు. న్యూయార్కు టైమ్స్ పత్రిక దీనిని "50,000 డాలర్ల ఆలోచనా కార్యక్రమంగా" అభివర్ణించింది. ఈ కార్యక్రమాన్ని తిలకించే మహదవకాశం తలవనితలంపుగా నాకు కలిగింది. అమెరికా దేశంలో అగ్రగణ్యమైన విశ్వవిద్యాలయాలలో ఒకటిగా కీర్తి ప్రతిష్ఠలు గడించిన ఈ విశ్వవిద్యాలయ విద్యార్థులు తమ పెద్దల ప్రతిబంధకాలకు గురికాకుండా జాతీయ పరిస్థితిపట్ల తమ మనోభిప్రాయాలను తీవ్రంగా ప్రకటిస్తూ వుండిన సమయం. ఇందులో జంతు వృక్ష శాస్త్రజ్ఞుడైన డా. బారీకామనర్ నుంచి నటకుడైన ఎడ్డీ ఆల్బర్ట్ వరకు గల ప్రముఖ వక్తలందరూ పాల్గొన్నారు. ఈ సమావేశంలో చర్చించిన అంశాలు కూడా అనేకంగా వున్నాయి. సామాన్య అమెరికన్ వ్యక్తి యొక్క అభిప్రాయాలను వీరు ప్రతిబింబింపచేశారు. "పరిసరాల సంక్షోభస్థితి" "మానవజాతిని ఎదుర్కొంటున్న మనుగడ సమస్య" మనుగడకు పరిసరాల చర్య" అనే నినాదాలను నేను తరచు విన్నాను. అమెరికన్ సాంప్రదాయాలకు భిన్నమైన అభిప్రాయాలు ఈ సమావేశంలో వ్యక్తమైనాయి. న్యూయార్కు టైమ్స్ పత్రిక ఈ యువకుల ప్రదర్శనపట్ల అమెరికాలోని సామాన్య మానవుడి అభిప్రాయం గురించి రాస్తూ "ఇక్కడ చెప్పిన విషయాలు మాత్రమే కాదు, చెప్పిన ధోరణి, వీటిని చెప్పిన ప్రజలు ముఖ్యం" అని ఆన్ ఆర్బర్ మెట్రిన్ అన్నట్లు రాసింది. ఈ "50,000 డాలర్ల ఆలోచనా కార్యక్రమం" ఒక రిహార్సలు వంటిది మాత్రమే. ఏప్రిల్ 22వ తేదీన జాతీయ స్థాయిలో జరుగనున్న ఈ-డే ప్రోగ్రాము సందర్భంలో భారీ యెత్తున దేశం నలుమూలల నుంచి 900 మంది కాలేజి విద్యార్థులు 3000 మంది స్కూలు విద్యార్థులు ఇందులో పాల్గొంటారని ఆశించబడుతున్నది. అమెరికన్ మేధావులను-యువకులు కాని వృద్ధులు కానివ్వండి- ప్రస్తుతం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్యలను గురించి ఇది మనకు కొంత తెలియ జేయగలదు.

కొన్ని రోజుల తరువాత వాషింగ్టన్‌లో వైట్‌హౌస్‌ను నేను సందర్శించినపుడు కూడా వైట్‌హౌస్ ముందర వ్రాసిన నినాదాలు, ప్రదర్శించిన పోస్టర్లనుబట్టి దేశమంతటా అమెరికన్ ప్రజల అభిప్రాయాలు. ఆలోచనలు ఏమిటో నాకు కొంతవరకు తెలిసింది. వైట్‌హౌస్ ఎదుట రెబకా షోగిల్ అనే మహిళ ప్రెసిడెంట్ కెనడీ హత్య గురించి నాకు అంతా తెలుసునని బాహాటంగా చాటి చెప్పింది. (యఫ్.బి.ఐ. వారు ఆమెను అక్కడి నుంచి వెళ్ళగొట్టారు కూడా). ఆన్ ఆర్బర్‌లో జరిగిన సమావేశంలో చర్చించబడిన అంశాలు ఇవి. (1) పెద్దలకు చిన్నతరం వారికి మధ్య అఘాతంగావున్న వ్యత్యాసం (2) శ్వేతవర్ణులు, రంగు జాతి వారు (3) జనాభా పెరుగుదల (4) వియత్నాం (5) ఆర్థికాభివృద్ధి జరగని సందర్భములో చేయవలసిన సర్దుబాట్లు (6) దేశంలోని ప్రధాన నగరాలలో గాలి, నీరు తీవ్రంగా కలుషితమవుతున్న వాతావరణం. పరిసరాలను కలుషితం చేస్తున్నవారిపై మూక ఉమ్మడిగా ప్రజల తరఫున దావాలు వేయవలసిన అవసరం. ఈ సమావేశంలో చర్చించిన అంశాలకు దృశ్య ప్రచారంచేయడానికి విద్యార్థులు ధరించిన బాడ్జీలు ఇవి: (అ) ప్రపంచపు మనుగడకు ఒక అవకాశమివ్వండి. (ఆ) ఇద్దరు పిల్లలు చాలు. (ఇ) మనం వియత్నాంలో ఎందుకు వున్నట్లు?- ఇలాంటివే మరికొన్ని.

## వియత్నాం యుద్ధం

వియత్నాం విషయంలో అమెరికా బురదలో కాలు పెట్టిందనీ, ఇందులో నుంచి బైటపడడానికి మంచి మార్గం కనిపించటం లేదనీ అక్కడ పెద్దలు పిన్నలు చాలామంది భావిస్తున్నారు. వైట్‌హౌస్ వెలపల విపరీతంగా జనం క్యూలో నిలబడివున్నారు. అక్కడ నేను ఒక అమెరికన్ దంపతులను కలుసుకోవటం తటస్థించింది. వీరు కొలరెడో నుంచి వచ్చారు. వారివెంట ముగ్గురు పిల్లలు వున్నారు. వారికి నాల్గవ సంతానం కలుగబోతున్నది. వారి వ్యక్తిగత విషయాలకు కారణాలులేకుండానే ఆ యువకుడు స్వయంగా క్షమాపణ చెప్పుకొంటూ ఇదే మాకు ఆఖరు సంతానం కలుగబోతున్నదని చెప్పాడు. ఆన్ ఆర్బర్ ఆలోచనా కార్యక్రమం పేర్కొన్న జనాభా పెరుగుదల పట్ల యువతరానికి చెందిన అమెరికనులు ఏ విధంగా ప్రవర్తిస్తున్నారో దీన్ని నిదర్శనంగా తీసుకోవచ్చు. జనాభాను అరికట్టి పరిస్థితి స్థిరత్వం చేకూర్చడానికి ప్రజలు ఎంతగా ఆలోచిస్తున్నారో దీన్నిబట్టి తెలుస్తుంది. ఆ యువకుడు వియత్నాం యుద్ధంలో మూడేండ్లు పాల్గొని అందులో నుంచి బైటపడినాడు. ఇంక యుద్ధం వద్దు అనే భావం అతనికి కలిగినట్లు నాకు తోచింది. ఈ భార్యాభర్తలు మూడేండ్ల క్రితం విడిపోయి జీవితాన్ని ఎక్కడ నిలిపివేశారో అక్కడి నుండి మళ్ళీ ఆరంభించడానికి వారు పూనుకోవలసివచ్చింది. ఆ యువకుడు ముందు విశ్వవిద్యాలయానికో

కమ్యూనిటీ కాలేజీకో తిరిగి వెళ్ళి అక్కడ ఏదో ఒక రెండేండ్ల కోర్సును పూర్తి చేసుకొని ఉద్యోగంలో చేరాలని కోరికతో వున్నాడు. అంతిమంగా ప్రతిష్ఠాకరమైన 4 ఏండ్ల కాలేజీ కోర్సు పూర్తి చేయాలని అతని ప్రగాఢ వాంఛ. అప్పుడు అతనికి బోధనా వృత్తిలో మంచి ఉద్యోగావకాశాలు లభిస్తాయి. జీవన భృతికి ఉపాధ్యాయ వృత్తిని చేపట్టాలని అతను ఇది వరకే నిర్ణయించుకొన్నాడు.

## వర్ణ భేధం

అన్ అర్బర్ ఆలోచనా కార్యక్రమంలో పాల్గొన్న నీగ్రో వక్తలు అమెరికాను ఎదుర్కొంటున్న మరొక సమస్యను బైట పెట్టారు. అదే శ్వేతవర్ణులు, రంగు జాతీయుల సమస్య. వైట్ హౌస్‌కు ఎదురుగా వున్న పెన్సిల్వేనియాలో జాతికి వెంటనే సవాలు చేస్తున్నది. ఏకీకరణ సమస్య కాని గాలీ నీరూ కలుషితం సమస్య కాదు అని ప్రముఖంగా ఒక పోస్టరు ప్రదర్శించబడింది. దేశంలో బహుళ సంఖ్యలో వున్న నీగ్రోల మనోభిప్రాయాలను ఈ పోస్టరు చాటి చెబుతున్నది. కనుక సామూహిక భావాలకు భిన్నంగా నీగ్రో వ్యక్తులు మాట్లాడంలో ఆశ్చర్యం ఏమిలేదు. పరిసరాల సంక్షోభ స్థితి సాంఘిక రాజకీయ విప్లవానికి అడ్డువస్తున్నదని మార్క్సిస్టు వాదనలతో ఈ చర్చలకు తరచు అంతరాయం కల్గింది. కలుషితం సమస్యలో నిమగ్నులై వుండడమంటే అది "శ్వేతజాతీయుల మధ్యతరగతి వర్గం చేస్తున్న వాదన. నీగ్రోలవి, బీద ప్రజలవి సమస్యల నుంచి దృష్టిని మళ్ళించడానికి చేసిన పన్నాగం" అని నీగ్రోలు తరచూ ఆరోపణలు చేశారు.

జంతువృక్ష శాస్త్రంలో కలుషితం సమస్య మాత్రమే కాక ప్రాణి కోటియొక్క పరస్పరం సంబంధం, "ఘెట్టోలు అప్లేషియా, యుద్ధాలు" కూడా చేరివుంటుందని శ్వేతవర్ణులూ, నీగ్రోలూ అభిప్రాయం వెలిబుచ్చారు.

## తరాల తారతమ్యం

మిచిగాన్ సమావేశం అమెరికాను ఎదుర్కొంటున్న అతి ముఖ్య సమస్య—అంటే అనివాయితీగావున్న వ్యవస్థకు, యువకులకు మధ్యగల ఒకతరం వ్యత్యాసం పట్ల తీవ్రంగా సమాలోచనలు జరిపింది. ఆలోచనా కార్యక్రమం సభ్యులు తమ కార్యక్రమాలకు నిక్సన్ ప్రభుత్వం నుంచి నేరుగా డబ్బు వసూలు చేయకుండా తప్పించుకొన్నారు. ప్రభుత్వపరంగా సభ్యులు ఎన్నికైనారనే అపవాదును లేకుండా చేయడానికి వారు ఈ పని చేశారు. అమెరికాలోని పెద్దలు ఈ సమస్యను సానుభూతితోను సహనంతోను పరిశీలించడం వారి ఘనతను చాటుతుంది. విద్యార్థుల సమావేశంలో సెనటర్ మస్కీ ప్రసంగిస్తూ ఇలా అన్నారు "మీ అభిప్రాయాలతో నేను ఏకీభవించకపోవచ్చు. నా అభిప్రాయాలు మీకు నచ్చకపోవచ్చు. అయితే కొన్ని అభిప్రాయాలపట్ల మనకు పరస్పరం అంగీకారం కుదరవచ్చని ఆశిద్దాం". అమెరికాలో ఇప్పటివ్యవస్థకు యువతరానికి మధ్య ఎంతో అఘాతం ఏర్పడింది. ఇది అనేక రూపాలు దాల్చింది. తిరోగమనానికి దారితీసే హిప్పీ ఉద్యమం నుంచి అరరహితమైన హింసాకాండ వరకు ఇది అనేక విధాలుగా వుంది. మార్చినెలలో కాలిఫోర్నియా విశ్వవిద్యాలయపు శాంతా బార్బరా ఆవరణను సందర్శించాను. ఇక్కడ కొన్ని రోజులకు ముందు విద్యార్థులు కొందరు బ్యాంక్ ఆఫ్ అమెరికా భవనాన్ని అగ్నికాహుతి చేశారు. విద్యార్థులమూక ఒకటి పోలీసు గస్తీ కారుకు నిప్పు అంటించి భస్మీభూతం చేశారు. రోడ్డు ప్రక్కన ఈ చిహ్నాలు ఇంకా నిలచివున్నాయి. నేను వీటిని చూచాను. ఈ దౌర్జన్యకాండను, విద్యార్థులు కాని వారు ప్రజలలో కలిసిపోయి చేశారని కొంతమంది విద్యార్థులు నాకు చెప్పారు. శాంతాబార్బరా ఆవరణలో బ్యాంక్ ఆఫ్ అమెరికా (ఐలావిస్టా సమీపంలోవున్న ఈ బ్యాంక్) విద్యార్థులకు ఏ విధమైన అపకారం చేసిందని నేను విద్యార్థులను అడుగగా వారి సమాధానం విని నాకు చెప్పనలవి కాని ఆశ్చర్యం కలిగింది. ఈ బ్యాంకు భవనం విషయం ఎవరి స్మృతిపథంలో కూడా లేదనీ, అది దృష్టిలోపడిన తరువాత అప్పటి కప్పుడు దాన్ని తగులబెట్టాలని నిర్ణయం జరిగిందనీ వారుచెప్పారు. బ్యాంక్ ఆఫ్ అమెరికా ఇక్కడ నడుపుతున్న శాఖ నష్టంలో పని చేస్తున్నది. బ్యాంకు అధికారులు ఈ శాఖను మూసివేసి మరొక చోట నెలకొల్పవలసివుంటుంది. అయితే కాలిపోయిన భవనం ప్రక్కనే అప్పటికప్పుడు ప్రీ ఫేబ్రికేటెడ్ భవనాన్ని నిర్మించి సమాజానికి సేవచేయాలని బ్యాంకు అధికారులు నిర్ణయించారు. లాభసాటి వ్యాపారం కొనసాగించడం కన్న దౌర్జన్యపూరితులైన అల్పసంఖ్యాక వర్గాలకు సవాలుగా ఇక్కడే బ్యాంకు నడపాలని వారు నిర్ణయం చేశారు. ప్రీ ఫేబ్రికేటెడ్ భవనంలో బ్యాంకు శాఖను స్థిరం చేసిన తరువాత జాతిని ఉద్దేశిస్తు బ్యాంకు చేసిన వినతి గమనార్హమైనది. ఇందులో నుంచి కొన్ని వాక్యాలు ఉదహరించడానికి ఈ వినతి ప్రతిని ఒకదానిని నేను మన దేశానికి తీసుకొని వచ్చాను. విద్యార్థుల అలజడి ఎందుకు వచ్చింది అని వివరిస్తూ వినతిపత్రం ఇలా చెబుతుంది. "ఈ దౌర్జన్యకాండలో పాల్గొన్న వారు "క్యాపిటలిస్టు వ్యవస్థ" "వియత్నాంయుద్ధం" "చికాగోన్యాయ విచారణ" "విద్యార్థులను అణగద్రొక్కడం" పోలీసుల దౌర్జన్యం" అమెరికాపట్ల యింకా ఇతర అనేక ఫిర్యాదులకు ఇది నిరసన చర్య అని చెబుతున్నారు. ఈ ఇబ్బందులు, బాధలు కొన్ని వాస్తవమైనవి. కొన్ని ఊహాజనితములు, మిగిలినవి సత్యదూరములు. అయితే వీటినన్నిటినీ వ్యక్తం చేయవలసిందే. ఎంతవరకు అవివ్యక్తంకాలేదో ఎంతవరకు వాటిని తీవ్రంగా పరిశీలన జరగలేదో ఆ మేరకు అమెరికనులు యువతరంవారి విశ్వాసాన్ని కోల్పోతారు. అయితే అమెరికను లందరికీ వారు వృద్ధులు కానివ్వండి, యువకులు కానివ్వండి, లిబరల్స్ కానివ్వండి, కన్సర్వేటివ్‌లు కానివ్వండి, దౌర్జన్యంవల్ల నష్టమే కలుగుతుంది. దౌర్జన్యం ధ్వంసము అనేవి అరాచకానికే, ప్రజాపీడనకూ మూలకారణాలవుతాయి. రాజకీయ విషయాలలో భిన్నాభిప్రాయం వ్యక్తం చేయడానికి హింసను పూర్తిగా, పరిపూర్ణంగా త్యజించేందుకు అమెరికనులకు సమయం వచ్చిందని మేము విశ్వసిస్తున్నాము. అమెరికను లందరూ ఈ విషయంలో ఒకే అభిప్రాయం కలిగివున్నారని భావిస్తున్నాము"

## నల్లజాతి విద్యార్థుల ప్రదర్శన

శాంతాబార్బరా ఆవరణలో జరిగిన అర్థంలేని హింసాకాండ చెదురుమదురుగా జరిగిన సంఘటన అయినప్పటికీ అమెరికాలో విద్యార్థుల అలజడి అనేక రూపాలలో బాగా వ్యాప్తిచెందింది. తీవ్రవాదులైన హిప్పీలు సమాజం పెద్దలతో సంఘర్షణకు దిగకుండా, తమ ప్రపంచంలో తాము బహుశ మునిగిపోయారని చెప్పవచ్చు. మాసినబట్టలు ధరించడం, కేశసంస్కారం లేకుండా గిరిజాలు పెంచుకోవడం, గెడ్డం గీసుకోకుండావుండడం, పాదరక్షలు లేకుండాతిరగడం, మారిజానా, యల్.యస్.డి. హరాన్‌వంటి ప్రమాదకరమైన మత్తుపదార్థాలు సేవించడం, స్త్రీపురుషభేదం లేకుండా ప్రవర్తించడంవంటి పనులలో వీరు నిమగ్నులైపోయారు. అమెరికాలో ఏ నగరంలోకూడా లేనంత మంది హిప్పీలు శాన్ ఫ్రాన్సిస్కో, లాస్ ఏంజెల్స్ నగరాలలో వున్నట్లు నాకు తోచింది. జపనీస్ టీ గార్డెన్, గ్రిఫిత్‌పార్కు వంటి స్థలాలపై వారికి మక్కువ యెక్కువగావున్నట్లు తోచుతుంది. అయితే, హిప్పీల కోవకు చెందని అసంఖ్యాక యువకులు కయ్యానికి కాలు దువ్వుతున్నారు. నేను అమెరికాలో ఉన్న కొద్ది రోజులలో, కనీసం 6 విశ్వవిద్యాలయాలు విద్యార్థుల బెడదకు గురియైనాయి. సీటిల్‌లోని వాషింగ్టన్ స్టేట్ యూనివర్సిటీలో జరిగిన సంఘటన పతాక శీర్షికలతో పత్రికలో ప్రచురించబడింది. ప్రముఖంగా టెలివిజన్‌లో ప్రదర్శించబడింది. మార్చి 6 వ తేదీన సీటిల్‌లో వాషింగ్టన్ స్టేట్ యూనివర్శిటీ ఆవరణలో నేను నడుస్తుండగా, అడ్మినిస్ట్రేషన్ బ్లాకు సమీపంలో బ్రహ్మాండమైన విద్యార్థుల ప్రదర్శన ఫలితంగా ఇక్కడి ప్రశాంత వాతావరణానికి అకస్మాత్తుగా భంగంకలిగినట్లు గమనించాను. యూనివర్శిటీ అధికారులు మోర్మాన్ యూనివర్శిటీ అయిన బ్రిగ్‌హాం యంగ్ యూనివర్శిటీ వారితో స్పోర్ట్స్ విషయంలో కలిసి పనిచేసిన విధానాన్ని నిరసిస్తూ, నీగ్రోవిద్యార్థులు ఈ ప్రదర్శన చేశారు. మోర్మానులు క్రైస్తవ మతావలంబికులు. నీగ్రోలపట్ల వివక్షత భావంచూపుతున్నారు. అంటే మతగురువులుగా నీగ్రోలను తమలో చేర్చుకోరని, నాకుచెప్పారు. ఇందులో న్యాయన్యాయములెట్లున్నా నాకు ఆశ్చర్యం కలిగించిందేమంటే ఈ విధానాన్ని నిరసిస్తున్న నీగ్రోవిద్యార్థులు, కఠోరంగా దౌర్జన్యపూరితమైన ఉద్రేకంతో హద్దులులేకుండా ప్రసంగించారు. నేను ఈ రంగాన్ని తిలకిస్తున్నప్పుడు ఒక యువనీగ్రోవిద్యార్థి అక్కడ గుమికూడిన ప్రజలను ఉద్దేశించి ప్రసంగిస్తున్నాడు. కొద్దిక్షణాలలో జనం ఇష్టంవచ్చినట్లు ప్రవర్తించి అడ్మినిస్ట్రేషన్ భవనాన్ని "ఆక్రమించారు." నేను అతినేర్పుగా అక్కడినుంచి తప్పించుకొని వెళ్ళాను. ఈ జనం ఏ విధంగా దౌర్జన్యానికి దిగి అడ్మినిస్ట్రేషన్ భవనాన్ని ధ్వంసం చేసిందీ, నేను ఆ రోజు సాయంత్రం టెలివిజన్‌లో చూచాను. యూనివర్శిటీ వైస్‌ప్రెసిడెంట్ విద్యార్థులకు విజ్ఞప్తి చేస్తూ, అడ్మినిస్ట్రేషన్ విధానాన్ని వివరించి చెబుతున్న దృశ్యాన్ని కూడా టెలివిజన్‌లో చూచాను. అదే వారంలో నేను ఒక నగరం నుంచి మరొక నగరానికి వెడుతున్నప్పుడు, ఆన్ ఆర్బర్, మిచిగన్ ఇలినాయిస్ యూనివర్సిటీ వంటి స్థలాల్లో విద్యార్థుల ఆందోళనా వార్తలను నిరంతరం వినేవాణ్ణి. 38000 మంది విద్యార్థులుగల ఆన్ ఆర్బర్ ఆవరణలో వివాదగ్రస్థమైన బ్యాంకు విషయంలో విద్యార్థులు ధ్వంసాకాండకు పూనుకొన్నారు. రిట్‌ఫీల్డ్ కార్పొరేషన్ భవనం మెట్లపైన డాంబారు ఈకెలు విరజిమ్మారు. అలాస్కాలో చమురు అభివృద్ధికి పూనుకొన్న ఈ కార్పొరేషను ఇక్కడి ఉద్యోగులను రిక్రూటుచేస్తూ వుంటుంది. ఒక విద్యార్థిని సస్పెండు చేశారనే కారణంపైన విద్యార్థులు కొందరు డీన్ ఆఫీసులో బైఠాయింపు సమ్మె విజయవంతంగా కొనసాగించారని ఒక వార్త విన్నాను. యూనివర్శిటీ సంఘాలలో తమకుకూడా ప్రాతినిధ్యం వుండాలని శాంతా బార్బారాలో విద్యార్థులు నాలుగు గోడలమధ్య ఆందోళన కొనసాగించారు.

(సశేషం)

---

**ఈ సంచికలోని వివిధ శీర్షికలను గురించి, ఇందలి రచనలను గురించి మీ అభిప్రాయాలు తెలుపండి. మీ సూచనలకు, సలహాలకు, విమర్శలకు స్వాగతం.**

---



# రామదండు

గుమ్మిడిదల వెంకటసుబ్బారావు

ఈ మధ్య ప్రస్తుత "నక్సలైట్" బెడద మున్నగు ప్రజా క్షోభల నెదుర్కొనే సందర్భములో మన ప్రజా సంబంధామాత్యులు గౌ॥ శ్రీ వాసుదేవరావుగారొక చక్కని సందేశము నొసంగిరి. అందు శ్రీ వాసుదేవులు యిట్లా శెలవిచ్చారు.

"ప్రతిచోటా పోలీసుల శిబిరాలు" పెట్టడం సాధ్యంకాదు. ప్రజలు దళాలుగా యేర్పడి ఎప్పటి సమాచారాన్ని అప్పుడు తెలుసుకొంటూ, గ్రామ సమస్యలను పరిష్కరించుకోవాలి. ఈ దళాలకు 'రామదండు' అనిపేరు పెట్టుకోవచ్చునని శ్రీ వాసుదేవరావుగారు సూచించేరు. పవిత్రమైన లక్ష్య సాధనతో ప్రజలు కృషిచేసి, రాష్ట్ర సౌభాగ్యాన్ని సాధించాలని ఆయన అన్నారు. (ఆంధ్రప్రభ, ది 19-10-69).

'రామదండో', లేక 'గ్రామదండో', అసలీ విషయ ప్రాశస్త్యాన్ని ముందుగ గ్రహించి, యిందు విషయమై లోగడ, సరిగా ఏభై యేండ్ల క్రిందట, అభినవ రామదాసు, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారొనర్చిన కృషిని గూర్చి కొలదిగ ఇచ్చట ప్రస్తావించెదను.

## శ్రీ అరవిందుని శాసనము

ఆదిలో యీ "గ్రామదండుల" గూర్చి మన జాతీయోద్యమములో ఉద్బోధించిన మహనీయుడు, శ్రీ అరవింద ఘోష్. 1905-1910 సంవత్సరములలో భారత స్వాతంత్ర్యోద్యమములో 'నాన్ కో ఆపరేషన్', అనగా అప్పటి బ్రిటిష్ ప్రభుత్వముతో అసహాయ యోగమే మనజాతికి శరణ్యమని చెప్పుచు, భారతీయ ప్రభుత్వ స్కూళ్లు, కోర్టు, పోలీసులను బహిష్కరించవలసి యుండుననియు; వానిస్థానే ఒక నిర్మాణ కార్యక్రమ మవసరమగుననియు చెప్పుచు యింకను అతడిట్లు వ్రాసెను.

"విజాతీయ న్యాయస్థానములను మనము బహిష్కరించెడిచో, మన స్వంత పంచాయతీ కోర్టు ఉండవలెను. మనబిడ్డలను ప్రభుత్వ పాఠశాలలకు పంపకుండ నుండవలెనన్నచో, జాతీయ పాఠశాలలు అవసరము. ప్రభుత్వ రక్షణ మనకు వలదన్నచో, మన స్వంత ఆత్మరక్షణ, అన్యోన్యసహాయక దళములవసరము" అని శ్రీ అరవిందుని ఉపదేశము. ఇందుకనుగుణ్యముగ ఆ రోజులలో శ్రీ అరవిందులే ఒక "వాలంటీర్" దళమును నెలకొల్పెనట, తదుపరి కాంగ్రెసుసంస్థయు, శ్రీ గాంధీమహాత్ముడును, పలుసార్లు యిట్టి సేవా దళములుండవలెనని తీర్మానించిరి. కాకినాడ కాంగ్రెసులో (1923) 'హిందూస్థాన్ సేవాదళ'మను నొక సంస్థను ఆశీర్వదించుచు ఒక తీర్మానము అంగీకరింపబడెను. కాని తీర్మానములకు పనులు జరుగునా! మంత్రాలకు చింతకాయలైన రాలవచ్చుమగాని! తుదకు 1947 సం॥ములో దేశము మూడు ముక్కలుగ విభజించబడుచున్నప్పుడు కాని, హిందూవులు, ముస్లిములు లక్షలాది అంతర్యుద్ధమునకు గడంగి, ఉత్తర హిందుసానమంతటిలో గృహదహనములు, ఒండొరులను పొడిచి, చంపుకొనుట, దోపిడీలు, స్త్రీల అపహరణము, రైళ్ళలో మూకుమ్మడి హత్యలు, మున్నగు

దుశ్చర్యలు, ఘోర కృత్యములు జరుగుచున్న. కేంద్రమందును, వివిధ రాష్ట్రములందును అధికారములో నుండియు, యీ దుర్మార్గముల నణచి, ప్రజల మాన, ప్రాణ, ధన రక్షణా యత్నములలో తోడ్పడుటకుగాను కాంగ్రెసు మహాసంస్థకుగూడ పట్టుమని 10 వేల మంది వాలంటీర్లు లేకుండుట లోకవిదితము. అంతకు కొలది కాలము పూర్వమే శ్రీ మాలవ్యా పండితుడును ఆ తరుణమందు ప్రజా రక్షణకును, శాంతి స్థాపనకును దేశమందెట్టి దళమును లేకపోయెన అని విలపించి తన యసువులను త్యజించెను.

## దేశముఖ్ ఉవాచ

1957 సం॥ములో అప్పటి యూనివర్సిటీ గ్రాంట్ల కమిషన్ అధ్యక్షుడు, మాజీ భారత ఆర్థికమంత్రియునగు శ్రీ సి. డి. దేశముఖ్‌గారు అంతకు ముందు తమ చైనా యాత్రానుభవముల గూర్చి ప్రస్తావించుచు యిటుల జెప్పిరి. "చైనాలో జాతీయ ఆదాయమునకు సంబంధించిన సరియగు లెక్క డొక్క లెవ్వియు లేని సందర్భమున, అచ్చటి ప్రభుత్వము ప్రజలతో సరాసరి సంబంధము నేర్పరచుకొని (వివిధ వర్గములవారి) పన్నుల భరింపుశక్తిని దెలుసుకొనుచున్నది. అచ్చట లక్షలాది పార్టీ సేవకులు ప్రజలతో దైనందిన పరిచయము గలిగియున్నారు. అందుచే వారి పరిస్థితులను దెలుసుకొనుటకు వారికి వీలు కలుగుచున్నది" కాని మనదేశమందలి పరిస్థితులగూర్చి ప్రస్తావించుచు, అదే ఉపన్యాసములో శ్రీ దేశముఖ్‌గారిటుల నుడివిరి. "మన దేశములో మాత్రము పరిస్థితి భిన్నముగానున్నది. లక్షలాది కార్యకర్తలుగల యే ఒక్క రాజకీయ పార్టీయు యిచ్చటలేదు. ఉన్న స్వల్ప మంది అయినను సాధారణమున ఏదో ఒక ఎలెక్షన్ (ఎన్నిక)లో నిమగ్నమై యుందురు. ఈ యెన్నికలు జనరల్ ఎలెక్షన్లు కావచ్చును_స్థానిక సంఘ ఎన్నికలు, లేక సమితి ఎన్నికలు కావచ్చును_మరేవైన కావచ్చును_ప్రజా సేవకులు యీ మున్నగు ఎన్నికలలో నిమగ్నపోయి ప్రజా శక్తిని ప్రాణప్రదమగు నిర్మాణ కార్యక్రమములవైపు మరల్చజాలకున్నారు... రాజకీయ సంస్థలు తమ శక్తి సామర్థ్యములను దేశమునందలి ఆర్థికావసరముల ప్రాముఖ్యతను ప్రజలకు నచ్చజెప్పుటకు వినియోగించుట యెంతయో అవసరమని నా అభిప్రాయము." శ్రీ దేశముఖ్‌గారు ఒక్క ఆర్థికావసరముల గూర్చియే ప్రస్తావించిరి, కాని దేశములో యింకను సాంఘిక, ధార్మిక, విద్యా, ఆరోగ్యాది అక్కరలు ఎన్నియో యుండును. అందు క్షామ సమయములు, వరద సమయములు మున్నగు సమయములలో ప్రజాసేవ ఎంతయు అవసరము.

## శ్రీ ఆంధ్రరత్న సంకల్పము

1920 సం॥ములో శ్రీ గాంధీ మహాత్ముడు కాంగ్రెస్ ఆధ్వర్యమున అప్పటి బ్రిటిష్ ప్రభుత్వముతో శాంతి సమరమును సాగించెను. "ఏడాదిలో స్వరాజ్యమును సాధించవలె"నని ప్రకటించెను దాసు, మోతీలాల్, అలీ సోదరులు, నిజపత్రాయ్, దేశభక్త, ప్రకాశం, రాజాజీ, మున్నగు మహనీయులెందరో ఆ ఉద్యమమందు జేరి ఘనమగు సేవజేసిరి. అట్టివారిలో మన ఆంధ్రరత్న గోపాలకృష్ణుడొకడు. వారు రామభక్తుడగుటచె మనము వాంఛించు "స్వరాజ్యము" 'రామరాజ్యము' కావలెనని అతడు చెప్పెను. ఈ రామరాజ్యమును సాధించుటకును, రక్షించుటకును, యిచ్చట "శ్రీరామదండు"ను ది. 10_11_1920 తేదీన స్థాపించెను. అప్పట్లో తాను నడిపించిన చీరాల_పేరాల ఉద్యమము నందును, 1921 మార్చిలో బెజవాడలో కూడిన ఎ. ఐ. సి. సి. సమావేశ సందర్భమునను, యీ దండు ప్రశంసనీయమగు సేవ యొనర్చెను. ఇందు గూర్చి అప్పుడప్పుడు అతడు తెల్పిన యీ దిగువ హంశములు పాఠకుల కెఱుకపరచుట యవసరము.

## దండు అవసరము

"ఆంధ్రదేశమందు గతాను గతికముగ 'రామదండు' అను ప్రతిష్ఠాపనము నెలకొల్పబడుచు వచ్చెను. 'రామ' శబ్దము శైవ వైష్ణవాది సమస్తాంధ్ర హైందవ సంప్రదాయముల కత్యంతాదరణీయమగుటచే రామ దండను పేరును యిచ్చట నిరాక్షేపణీయముగ జేసెను. క్షామ సమయములు, అరాజక సమయములు రామదండుయొక్క ఉత్పత్తికి కారణములయ్యెను.

"ప్రస్తుత స్థితి గతులలో ధర్మ సందేహము లెక్కువగుటయు, దారిద్ర్య మధికమగుటయు, బహునాయకత్వమేర్పడుటయు, ప్రజలయందశాంతి అతిశయించుటయు, ముఖ్యముగ గమనింపదగినవి. వీనిని జయించుటకు నిదానము, వివేకము, నిరోధము, ధైర్యము, శౌర్యము, స్థైర్యము, శీలములత్యవసరములు. వీనిని సంపాదించుటకు ఆధునికులు స్వార్థ జ్ఞానమే (Enlightened self-interest) ప్రబల సాధనమని చెప్పుచున్నారు. ఆర్య సంప్రదాయమందుకు భిన్నముగ, నిరంతర మీశ్వర సేవా పరత్వమే సాధనమని సిద్ధాంతీకరించినది. స్వార్థ జ్ఞానముపదేశించి, ప్రజలను ఆవేశపూరితులు గావించినచో, అందు బయల్వెడలిన అహంకార విజృంభణమువలన కొంత కార్య సాధన చేకూరినను, అవసరమగుపట్ల జన సమూహమును శాంతులు, ప్రసన్నులజేయుట మిక్కిలి కష్టమును, కొన్నికొన్ని సందర్భముల బొత్తుగా వీలుపడకుండుటయు అనుభవైకవేద్యము. ఇందుకు మారుగా మన యత్నములలో 'రామ' శబ్ద ప్రవేశమైనచో, దృష్టియందు నిలచియున్న స్వార్థపరత ధర్మ నిరూపణమవలంబించును. నాయకులప్పుడు విశ్వమూర్తియగు మహాజన సమూహమునకు నిగ్రహానుగ్రహములు రెండును బ్రసాదింపగలుగుదురు.

## రామదండు ప్రాశస్త్యము

రామ దండు ప్రాశస్త్యముగూర్చి ప్రస్తావించుచు, ఆంధ్రరత్న మిటులజెప్పెను. "రామదండు కామధేనువు. ప్రజల వ్యవహారములన్నింటియందు, నిఖిల పురుషార్థ సాధనయందు, రామదండు ప్రయోజనకారిగనుండును. ధర్మ విషయములు, ఆర్థిక విషయములు, రాజకీయములు (ఎన్నికలు సహా), మత సంబంధములు వగైరా అన్నిటియందును రామదండు జోక్యము కలుగజేసుకొనుటకు అధికారము కలదు. మహాజనముమీద జరుగవలసిన

ర్యములకు ప్రయోగమందేగాక ఉపసంహారమందుగూడ శక్తి సామర్థ్యములుండుట ముఖ్యముగ అవసరము. కనుక రామ మంత్రి బలిమిచేగాక యింకొక విధముగ విది వీలుపడదుగావున రామదండు మార్గమే యిచ్చట అవసరమని గ్రహింపనగును.

## కార్య నిర్వహణము

దండుయొక్క కార్యనిర్వహణమునకై 1. గ్రామ (దండు) పంచాయతీ. 2. తాలూకా సభ. 3. జిల్లా (మండల) సభ. 4. యావదాంధ్ర ధర్మసభయను ప్రధానాంగములుండును.

## ఇతర విషయములు

ప్రతి దండును తమ గ్రామమందొక రామ మందిరము గలిగి యుండవలెను. అచ్చట జరుగు దీపధూప నైవేద్యాలకు వలయు ధనము దండు దక్షిణల వలన సేకరింపబడవలెను. ప్రతి సభ్యుడు తనకు దోచిన దక్షిణను ప్రతి నెలకు; ప్రతి దీక్షా దినమునను సమర్పించవలెను. నిరుపేదలను పోషించు మార్గము ననుష్ఠించుట రామదండు యొక్క ముఖ్య కర్తవ్యము. ఇందు నిమిత్తమై ప్రతి గ్రామమందును దీనజన శరణ్యమనునొక ఆశ్రమమును నెలకొల్పి, అందు అచ్చట భిక్షాటన జేయు స్త్రీ పురుషులందరకు, అన్నివర్ణముల వారికి నివేశనాదికము నిర్మించి, వారి వారి సమర్థతలనుబట్టి, యోగ్యతలను బట్టి, వృత్తులను గల్పించి, అందుకు వలయు ద్రవ్యాదికమును గ్రామ ప్రజలనుండి అభ్యర్థించి సాధ్యమైనంతవరకు వీరిని స్వయం పోషకులుగ ఒనర్పవలయును. ప్రతి దండు సభ్యుడును తన గ్రామములో భిక్షాటన మొనర్చు వారుండకూడదను ప్రతిజ్ఞబూని, దీనావన వ్రతము ననుష్ఠింప వలయును. రామదండు యొక్క ప్రధాన కర్తవ్య మిదియేనని స్పష్టముగా గ్రహింపవలెను. తమ గ్రామ సమీపము నుండి గాని, దూరస్థము నుండిగాని ఆర్తనాదము సహాయాపేక్ష వినవచ్చినచో తక్షణమే దీక్ష వహించి, రామదండు తమకు చేతనైనంత సేవ చేయవలెను. దండు వ్యవహారములను తెలుపుటకును, వివిధ ప్రాంతముల వృత్తాంతములను ప్రచురించుటకును, దండు ధర్మమును సిద్ధాంత పూర్వపక్షములు గావించుటకును, 'రామదండు' అను పేర యొక పత్రిక ప్రచురింపబడవలెను.

## కొన్ని ప్రశంసలు

చీరాల పేరాల ఉద్యమములో యీ రామదండు పాత్రకు యాపత్తూ గుంటూరు మండలము గోపాలకృష్ణుని వేనోళ్ళ నుగడించె. అప్పట్లో పొన్నూరులో జరిగిన మండల మహాసభలో యాతని 'ఆంధ్రరత్న' మని బిరుదాంకితు నొనర్చెను. 1921 మార్చిలో విజయవాడలో యీ దండు ఒనర్చిన మహత్తర సేవకు గాంధీ, దాసు, నెహ్రూ, అలీ సోదరులు, మాలవ్యా, శ్రీనివాస అయ్యంగార్, రఘువేంద్రరావు, మూంజే మున్నగు యావద్భారత నాయకులను గోపాలకృష్ణుని ప్రస్తుతించిరి. అందు ప్రధానముగా షౌకత్అలి " రామదండు అన్న నాకు ఎంతయో ప్రీతి. అది మన 'ఎర్రసేన' (Red Army) అని నేను భావింతు " నని వ్రాసెను. మాలవ్యా పండితుడు " గోపాలకృష్ణుని రామసేనకు నా హృదయపూర్వక ఆశీర్వచనములు. భగవంతుడు మిమ్మనుగ్రహించుగాక! " అని ఆశీర్వదించెను. డాక్టర్ మూంజే మహాశయుడు 1935లో రామనగర్ సందర్శించి నప్పుడిటుల దెల్పెను.

" గోపాలకృష్ణయ్య తన యసువులను త్యజించిన రామనగరును సందర్శింపగల భాగ్యము నాకు లభించినందులకు నేనానందించుచున్నాను. రామనగరిప్పుడొక్క చీరాల పేరాలవాసులకే గాక, యావదాంధ్ర దేశమునకు ఒక యాత్రాస్థలమైనది. గోపాలకృష్ణుడు తన ప్రజలను స్వరాజ్య సమరములో నడుపుచు స్వర్గస్థుడయ్యెను. అతడు భూత భవిష్యత్తులను బాగుగ నెఱిగిన ఋషిపుంగవుడు. కావుననే యీ 'రామదండు' అను పదము అతడు సృష్టించెను. ఈ ఒక్క మాటలో గత 6 వేలయేండ్ల భారత దేశ చరిత్ర అంతయు మూర్తీభవించి యున్నది. ఆ ఒక్క మాటలో లంకను జయించిన శ్రీరామచంద్రుని శీలము, శౌర్యము ఇమిడి యున్నది. ఆంగ్ల భాషలో 'కేడెట్' (Cadet) అను పదమునకింతటికంటె మంచి పర్యాయ పదముండనేరదు. కావున శౌర్యవంతులగు ఆంధ్ర ప్రజలకు నేను విన్నవించునది యేమనగా:— చక్కని నిర్మాణముతో, మంచి దుస్తులతో, సుశిక్షితులగు ఒక లక్షమంది రామదండును మీరు నెలకొల్పుడు. వారందరు ఒక సమర్థమైన నాయకత్వము క్రింద పనిచేయవలెను. అప్పుడే గోపాలకృష్ణుని యాత్మ శాంతినెందగలదు." ఇంతేగాక మూంజే మహాశయుడు తదుపరి నాశికలో భాన్స్లే సైనిక కళాశాల నేర్పరిచినప్పుడు, యీ రామదండు నడపడిని. ఆ స్థలమును "రామభూమి" యనియు అచ్చటి విద్యార్థులను (Cadets) 'రామదండీ' లనియు; తన తంతి విలాసమును " రామదండి—నాశిక " అనియు పేర్కొనెను. 1940 సం॥ములో తన ఆధ్వర్యమున నెలకొల్పబడిన సేవాదళమును "రామసేన" యని నామకరణమొనర్చుట లోకవిదితము.

కావున దేశమందలి వివిధ ప్రాంతములలో, అనేక ప్రజా కార్యములకై శివసేన, శోషితసేన, ద్రవిడసేన, గోపాలసేన మున్నగు సేవాసంఘము లెన్నియో బయల్వెడలుచున్న యీ సమయములో, యిచ్చటి ప్రజావసరముల నీడేర్చుటకు గాను, లోగడ ఆంధ్ర రత్నము సంకల్పించిన రీతి, యిటీవల మన ప్రజాసంబంధ మంత్రి సెలవిచ్చినటుల, శ్రీ రామదండును ఆంధ్ర మహాజనులు పునరుద్ధరించుటకు బూనుకొనెదరా ? ఆత్మారాముడు మొదలు 'ఆకాశరాముని' వరకు మన ప్రాంతమందు "అంతారామమయమే" నని మనమీ సందర్భమున మరువకుందుము గాక !



# దుగ్గిరాలయ్య

ముదిగొండ
వీరభద్రమూర్తి

అంగి లేని విశాలవక్షమున భద్రాక్షల్, శిరోవేష్టనం
బుం గట్టిన్ బుజమందు మూట తిలకంబున్ వస్త్రముల్ జేగుఱుల్
భృంగశ్మశ్రువు దీక్షితుం డదుగో! నవ్వెన్ దుగ్గిరాలయ్య యా
గంగార్థ ప్రచలద్భగీరథు డనంగా కన్నులన్ గట్టుచున్.

వృషముల మనుజులనుగా
వీక్షించి యుపన్యసింప వేల జనము ప్ర
త్యక్షమట వె! త్రుటిలో నా
దక్షత గోపాలకృష్ణ తత్ జ్ఞునకె తగెన్.

అతడు మహావక్త యనుటకు శ్రీకట్ట
మంచివారి పొగడ్తమాట చాలు
అతడు నాయకరత్న మనుటకు నఖిలభా
రతసభాకార్య దర్శితయ చాలు
అతడు సత్కవి చంద్రుడనుటకు తత్సంస్కృ
తాంధ్రభాషా కవిత్వమ్ము చాలు
అతడు మానవ తాప్తుడనుటకు వివిధకా
ర్మికజనసంఘ సంవృతియ చాలు

అతడు కోహినూరునకు మిక్కైన యాంధ్ర
జీవరత్నము, గృహి యైన చేవజోగి
రామదండున కధినేత, రామరూఢ
హృదయరథు డైన గోపాలకృష్ణబుధుడు.

బ్రహ్మత్వమున పట్టభద్రుగా ప్రతివాని
తీర్చుటకై ప్రయత్నించినాడు
గోష్ఠివిద్యాపీఠ గురుకుల జాతీయ
విద్యాక్రమంబు స్థాపించినాడు
పురము శూన్యము చేసి పొలము పురము చేసి
యెదిరించి ప్రభుత నోడించినాడు
ఆబాలగోపాల మైకమత్యవ్రత
నిష మౌ కృషికి జన్మించినాడు

వాడు శ్రీదుగ్గిరాలగోపాలకృష్ణ
డాంధ్రరత్న మతని యంత్యయాత్రదారి
పొడవుపొడ వెల్ల కన్నీట తడిపినారు
ప్రజలు గుంటూరు నుండి చీరాలవఱకు.



## తెలంగాణా మిగులు నిధులు

# భార్గవ కమిటీ నివేదిక ముఖ్యాంశాలు

(తెలంగాణా మిగులు నిధులను గురించి భార్గవ కమిటీ తయారుచేసిన నివేదికలోని కొన్ని ముఖ్య అంశాలు ఇందులో పేర్కొన్నాము.)

తెలంగాణా ప్రాంతంలో రెవిన్యూ ఆదాయం, ఖర్చులను లెక్క కట్టే పద్ధతులను గురించి చర్చించ డానికి ముందు, రాష్ట్రం మొత్తం మీద పని చేస్తున్న బోర్డులు, కార్పొరేషనులలో చేసిన పెట్టుబడి. వాటి మీద వచ్చిన ఆదాయవ్యయాల స్వరూప స్వభావలను పరిశీలించడం అవసరం. ప్రస్తుత రోజులలో ప్రభుత్వం అనేక వాణిజ్య కార్య కలాపాలను చేపట్టుతున్నది. తత్ఫలితంగా ఇవి అమలు జరుగుతున్న ప్రాంతాలు అభివృద్ధి చెందడానికి అవకాశాలు ఏర్పడుతున్నాయి. త్రి విధాలుగా ఇట్టి కార్యకలాపాలు కొనసాగుతున్నాయి. ప్రభుత్వ సెక్రటేరియటు అధ్వర్యాన ప్రభుత్వ శాఖలు లేక బోర్డుల ద్వారా నేరుగా పనులన్నీ కొనసాగుతున్నాయి. ఇది మొదటి పద్ధతి. చట్టాలు రూపొందించి వాటి ప్రకారము చట్టబద్ధ సంస్థలు ఏర్పాటు చేసి వాటి ద్వారా పనులు సాగించడం రెండవ పద్ధతి. పరిశ్రమలను ప్రోత్సహించే వుద్దేశంతో కంపెనీల చట్టాల క్రింద రిజిస్టరైన కార్పొరేషనులలో ప్రభుత్వం పెట్టుబడి చేయబడం మూడవపద్ధతి. ఈ కార్పొరేషనులు స్వతంత్ర ప్రతిపత్తి కలిగివుండి ప్రత్యక్షంగా ప్రభుత్వ జోక్యం లేకుండా పని చేస్తాయి.

ప్రభుత్వ శాఖలు, బోర్డుల ద్వారా ప్రభుత్వం స్వయంగా నిర్వహించే కార్యకలాపాల విషయంలో ఖర్చు, ఆదాయం, లేక మూల ధనాన్ని ప్రభుత్వ పరంగా చేసిన ఖర్చు లేక అభివృద్ధి పెట్టుబడులుగా పరిగణించాలనేది స్పష్టమైన విషయం. వీటివల్ల వచ్చిన ఆదాయాన్ని ప్రభుత్వ ఆదాయంగా పరిగణించాలి. ఇట్టి కార్య కలాపాలను రెండు భాగాలుగా విభజించవచ్చు. కొన్ని ఒక ప్రాంతము వరకు మాత్రమే పరిమితమై వుంటాయి. మరి కొన్ని ఇతర ప్రాంతాలకి చెంది వుంటాయి. ఇలాంటి సందర్భములలో అభివృద్ధి ఖర్చుగా పరిగణన పొందిన పెట్టుబడులు, తద్వారా వచ్చిన ఆదాయం ప్రత్యేక ప్రాంతానికి చెందినట్లుగా భావించాలి. మరొక విషయం రాష్ట్ర మంతటికీ చెందిన కార్యక్రమాలు కొన్ని వుండవచ్చును. ఇది ఏ ప్రాంతానికి చెందినదీ నిర్ణయించడం సాధ్యంకాదు. ఇట్టి సందర్భములలో వీటిని రాష్ట్ర మంతటికీ చెందిన సమిష్టి కార్యకలాపాలుగా భావించడం సమంజసమైన విషయం. దీన్ని ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలకు 2:1 నిష్పత్తిలో విభజించాలి.

చట్టబద్ధ సంస్థలు, కార్పొరేషనుల విషయంలోకూడా ఈపద్ధతే అనుసరించబడింది. పరిపాలనా సౌలభ్యం దృష్ట్యాను, ప్రజల సంక్షేమం దృష్ట్యాను, ఇట్టి బోర్డులు, కార్పొరేషనులు ఏర్పాటు చేయబడినాయి కనుక, వీటికై చేసిన పెట్టుబడులను వాటివల్ల వచ్చే ఆయవ్యయాలను ప్రభుత్వం నేరుగా తన శాఖలద్వారా కొనసాగించిన కార్య కలాపంగా భావించాలి. అంతే కాకుండా రాష్ట్ర ఫైనాన్షియల్ కార్పొరేషన్‌ద్వారా చేసిన పెట్టుబడులనుకూడా ప్రభుత్వ పెట్టుబడులుగా భావించవలసి వుంటుంది. ఏదైనా ఒక స్టాట్యూటరీ కార్పొరేషనుకు వాటాల జారీ ఫలితంగా సేకరించిన నిధులనుకూడా ప్రభుత్వానికి చెందినవేనని భావించాలి. కనుక ఖర్చులపోను, మిగులు నిధులను లెక్క కట్టడానికి స్టాట్యుటరీ బోర్డులు, కార్పొరేషనులను ప్రభుత్వ శాఖ తో సమానంగా చూడాలి ప్రధానంగా విద్యుచ్ఛక్తి మండలి, రోడ్డు రవాణా సంస్థ, రాష్ట్ర గృహ నిర్మాణ సంస్థ, రాష్ట్ర గిడ్డంగి సంస్థ, రాష్ట్ర ఫైనాన్షియల్ కార్పొరేషను వంటివి ఈ తరగతికి చెందుతాయి.

కంపెనీల చట్టం క్రింద రిజిస్టరైన కార్పొరేషనుల విషయం పరిశీలిద్దాము. ఇట్టి కార్పొరేషనులకు మెమొరాండం ఆఫ్ అసోసియేషన్, ఆర్టికల్స్ ఆఫ్ అసోషియేషన్ ప్రకారం, వాటాదారుల అంగీకారంపై కొన్ని అధికారాలు, విధులు సంక్రమిస్తాయి. వీటికీ, స్టాట్యుటరీ సంస్థలకూ చాల వ్యత్యాసం వుంది. స్టాట్యుటరీ సంస్థలు శాసన సభలు ఆమోదించిన శాసనాల ప్రకారం పనిచేస్తాయి. అయితే కంపెనీల చట్టం ప్రకారం ఏర్పాటు చేయబడిన కార్పొరేషనులకు న్యాయ రీత్యా ప్రత్యేక ప్రతిపత్తి వుంది. ఇవి పనిచేయడానికి స్వయంగా నియమావళి తయారుచేసే అధికారం వీటికి వుంది. ఇవి సక్రమంగా పనిచేయడానికి వీలుగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తరచుగా వాటాలు కొంటూ వుంటాయనేది వాస్తవమైన విషయం ఈ కార్పొరేషనులు నెలకొల్పిన ఫ్యాక్టరీలు సంబంధించిన ప్రాంతం అభివృద్ధికి దోహదకారి అవుతాయి.

**అయితే** ఈ ఫ్యాక్టరీలు ప్రభుత్వం తరపున మాత్రం పనిచేయడం లేదు. ప్రభుత్వం వీటిని స్వయంగా నడపడం లేదు కనుక ఈ ఫ్యాక్టరీలవల్ల వచ్చే ఆయవ్యయాలను ప్రభుత్వ కార్యక్రమానికి సంబంధించినవని భావించరాదు. ఇవి కార్పొరేషనుకు సంబంధించినవి అవుతాయి ప్రభుత్వానికి తానుచేసిన పెట్టుబడులపైన డివిడెండ్లు మాత్రమే పొందేహక్కు వుంటుంది. అప్పుల రూపంలో పెట్టుబడిచేసినట్లయితే, వాటిపైన వడ్డీ గడించవచ్చు. కనుక, ఈ కార్పొరేషనులు ప్రభుత్వానికి చెల్లించే డివిడెండ్లు, వడ్డీలను మాత్రమే ప్రభుత్వ ఆదాయంగాను, వాటాల రూపంలో చేసిన పెట్టుబడులను ఫ్యాక్టరీ నెలకొల్పిన ప్రాంతం అభివృద్ధికి చేసిన పెట్టుబడులుగాను పరిగణించడం సమంజసమని మేము భావిస్తున్నాము.

1956 సం॥ ఒప్పందం ప్రకారం, తెలంగాణా అభివృద్ధికి మిగులు నిధులను తేల్చి చెప్పడానికి తెలంగాణా రెవిన్యూ ఆదాయం, ఖర్చులను లెక్క కట్టడానికి 1959 వ సం॥ డాక్యుమెంటులో పేర్కొన్న సూత్రాలను అనుసరించాలని మా అభిప్రాయం. ఈ సూత్రాలు సమంజసమైనవి. అయితే వీటిని సరిగా, సక్రమంగా అన్వయించి చెప్పడానికి అందులో కొన్ని స్వల్ప మార్పులు చేయడం న్యాయమని భావిస్తున్నాము. ఈ విషయాలు దిగువ పేర్కొనబడినాయి.

## అమ్మకం పన్ను

1959 లో నిర్ధారించిన సూత్రాల ప్రకారం తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాలలో వేరు వేరుగా డిపాజిటు చేసిన అమ్మకం పన్ను మొత్తాలను ఆయా ప్రాంతాలకు చెందినట్లుగా భావించాలి. హైదరాబాదు రాజధానిలో డిపాజిటు చేసిన అమ్మకం పన్నును తెలంగాణా ప్రాంతానికి చెందిన ఆదాయంగా పరిగణించాలి అయితే కొన్ని నిర్దుష్టమైన సందర్భాలలో అమ్మకంపన్ను మొత్తాలు, ఆంధ్రప్రాంతానికి చెందినవని రుజువుగా చూపినట్లయితే ఆ ఆదాయం ఆంధ్ర ప్రాంతానికి చెందినట్లుగా భావించాలి. ఈ విషయం రెండు ప్రాంతాల మధ్య వివాద గ్రస్తమైవుంది. హైదరాబాదు నగరంలో ప్రధాన కార్యాలయంవుండి వ్యాపారమంతా వాటి శాఖలద్వారా ఆంధ్ర ప్రాంతంలో జరుగుతూవుంది. ఇట్టి సందర్భాలలో, హెడాఫీసు, బ్రాంచి ఆఫీసులు, హైదరాబాదులోని అమ్మకంపన్ను అధికారి సమక్షంలో ఒకే ఒక రిటర్న్ దాఖలు చేయడం పరిపాటి ఐంది. అయితే ఈ రిటర్నులలో హెడాఫీసు బ్రాంచి ఆఫీసుల క్రయ విక్రయాలు వేరు వేరుగా చూపబడివున్నాయి. ఏ ప్రాంతానికి ఎంత అమ్మకంపన్ను ఆదాయం వచ్చేదీ వేరు వేరుగా లెక్కలు తయారు చేయవచ్చు. అమ్మకం పన్ను అంచెనా వేసినపుడు ఈ క్రయ విక్రయాలన్నింటినీ ఒకే యూనిట్‌గా తీసుకొని, ఆ ప్రకారంగా పన్ను విధించడం జరిగింది. ఆంధ్ర ప్రాంతంలో హెడాఫీసు వుండి, తెలంగాణా ప్రాంతంలో బ్రాంచి ఆఫీసులు కల సందర్భంలో ఈ పద్ధతే అనుసరించబడింది. వీటి తాలూకు అమ్మకం పన్ను ఆంధ్ర ప్రాంతంలో చెల్లించడం జరిగింది. కొన్ని సందర్భాలలో ఏ ప్రాంతంలో బ్రాంచి ఆఫీసు వుందో, ఆ ప్రాంతంలోనే అది అమ్మకంపన్ను చెల్లిస్తూ వుంది. ఇలాంటి పరిస్థితులలో ఈ ప్రభుత్వ ఆదాయాన్ని ఆ ప్రాంతానికి చెందినట్లుగా భావించాలి. కనుక ఆంధ్ర ప్రాంతంలో వ్యాపారం జరుగుతూ, హైదరాబాదులో జమకట్టిన అమ్మకంపన్నును తెలంగాణా ప్రాంత ఆదాయంనుంచి మినహాయించాలి. ఇదే పద్ధతి ప్రకారం, తెలంగాణాలో వ్యాపారం జరుగుతూ, ఆంధ్ర ప్రాంతంలో జమకట్టిన అమ్మకంపన్ను మొత్తాలను ఆంధ్ర ప్రాంతం ఆదాయంనుంచి మినహాయించి తెలంగాణా ప్రాంత ఆదాయానికి జమకట్టాలి.

ప్రాంతీయ సంఘం అధ్యక్షులు మా సమక్షంలో సాక్ష్యమిస్తూ ఈ విషయంలో 1959 స॥ ఒప్పందానికి ఈ ప్రకారంగా అన్వయం చెప్పారు. ఈ అమ్మకం పన్ను నిర్దుష్టంగా ఆంధ్ర ప్రాంతానికి చెందినది అని పేర్కొంటూ హైదరాబాదు నగరంలో జమకట్టిన డబ్బు ఆంధ్ర ప్రాంతానికి చెందిన ఆదాయంగా పరిగణించాలి. అంతేకాని హైదరాబాదు నగరంలో అమ్మకం పన్ను జమకట్టిన సందర్భాలలో ఒప్పందంలో మినహాయింపు అనే పదాన్ని, కేసులను పునః ప్రారంభించడానికి వర్తింప చేయకూడదని కూడా ఆయన చెప్పారు. ఈ వాదన సరియైనది కాదు. రిటర్నులు దాఖలు చేసిన చోట, పన్నుల అంచెనా వేసిన చోట అమ్మకంపన్ను ఆదాయం రాదు. అమ్మకం పన్ను చట్టం ప్రకారం, ఎక్కడ విక్రయం జరుగుతుందో అక్కడనుంచి మాత్రమే అమ్మకం పన్ను ఆదాయం వస్తుంది కనుక ఆంధ్ర ప్రాంతంలో బ్రాంచి వ్యాపారం చేసి, హైదరాబాదులో అమ్మకం పన్ను చెల్లించినట్లయితే ఆ డబ్బు ఆంధ్ర ప్రాంతానికి చెందుతుంది. కాని హైదరాబాదులో డబ్బు చెల్లించినంత మాత్రాన అది హైదరాబాదుకు సంక్రమించినట్లు భావించ కూడదు 1959 లో ప్రాంతీయ సంఘం, ప్రభుత్వం కలసి అంగీకరించిన సూత్రాలను మేము ఈ సందర్భంలో అనుసరిస్తున్నాము.

మేము పూర్వాపరాలు బాగా ఆలోచించి, మా కార్యదర్శి ద్వారా కొన్ని పరీక్షలు జరిపించి అమ్మకం పన్ను ఆదాయాలను ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలకు వేరువేరుగా నిర్ణయించినాము.

## రాజ్యాంగం యొక్క 275 వ సూత్రం క్రింద గ్రాంట్లు

కేంద్ర ప్రభుత్వం యిచ్చిన సహాయక గ్రాంటులను ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలకు 2:1 నిష్పత్తిలో పంచాలని, రాష్ట్ర ప్రభుత్వం పంపిన వివరణ ఆధారంగా, శ్రీ లలిత్‌కుమార్ సేన్ నిర్ణయించారు. ఈ పద్ధతి ప్రకారం చేసిన కేటాయింపులకు ఆంధ్రప్రాంతానికి చెందిన ప్రతినిధులు అంగీకరించ లేదు. రాజ్యాంగం యొక్క 275 వ సూత్రం ప్రకారం కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన గ్రాంటులు రాష్ట్ర ఆదాయం లోటును తీర్చడానికి ఉద్దేశించబడినాయనీ, ఆదాయం విషయంలో తెలంగాణా మిగులు ప్రాంతంగానూ, ఆంధ్ర తరుగు ప్రాంతంగానూ వున్నాయి కనుక, ఈ పద్దు క్రింద వచ్చిన గ్రాంటులను ఆంధ్రకు చెందిన ఆదాయంగా పరిగణించాలని వారు వాదించారు. మా అభిప్రాయంలో ఈ వాదన అంగీకార యోగ్యమైనది కాదు. ఇందుకు రెండు కారణాలు

వున్నాయి. 275వ సూత్రం ప్రకారం వచ్చిన గ్రాంటులు కేవలం లోటును భర్తీ చేయడానికి మాత్రమే ఉద్దేశించ బడలేదు. వెనుకబడిన తనం, రాష్ట్ర అభివృద్ధిని కూడా దృష్టిలో పెట్టుకొని ఈ గ్రాంటులు ఇవ్వడం జరిగింది. రాష్ట్రానికంతటికీ సహాయకారిగా ఇచ్చిన గ్రాంటును, ఎక్కువ ఖర్చు జరిగిందనే కారణాల పైన ఒక ప్రాంతానికి మాత్రమే సంక్రమింప చేయడం న్యాయ సమ్మతం కాదు. ఈ కారణాల వల్ల గ్రాంటులను 2:1 నిష్పత్తిలో పంచవలెనని ప్రభుత్వం సూచించిన సూత్రంలో మార్పు అవసరం లేదని మేము అభిప్రాయ పడుతున్నాము.

## కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన ఇతర సహాయక గ్రాంట్లు

ఈ పద్దు క్రింద కేంద్రప్రభుత్వం ఇచ్చే గ్రాంటులు, ప్రణాళిక గ్రాంటులు ప్రణాళికేతర గ్రాంటులని రెండు విధాలుగా వున్నాయి ప్రణాళిక క్రింద వాస్తవంగా జరిగిన ఖర్చును మాత్రమే లెక్కలోకి తీసుకోవాలి. ప్రణాళికేతర గ్రాంట్ల విషయంలో, ఆంధ్ర-తెలంగాణా ప్రాంతాలకు 2:1 నిష్పత్తిలో కేటాయించాలి. రాష్ట్రప్రభుత్వం నుంచి వివరాలు సేకరించిన తరువాత ఈ సూత్రం ప్రకారమే మేము లెక్కలు, అంకెలు నిర్ణయించినాము.

## పెట్టుబడులపైన వడ్డీ

ఈ విషయంలో 1959 సం॥ డాక్యుమెంటులో పేర్కొన్న సూత్రాలు సమంజసంగా వున్నాయి ప్రత్యేకంగా తెలంగాణా ప్రాంతానికి జమకట్టిన వడ్డీ ఆదాయం తెలంగాణా ప్రాంతానికి చెందాలి. సమిష్టి పెట్టుబడుల మీద వచ్చిన ఆదాయాన్ని 2:1 నిష్పత్తిలో పంచి పెట్టాలి.

## సమిష్టి కార్యాలయాలు

1959 సం॥ డాక్యుమెంటులో పేర్కొన్న ప్రకారం రాజధానిలో ఆంధ్ర, తెలంగాణా ఉభయ ప్రాంతాలకు సమిష్టిగా ఏర్పాటు చేసిన సర్వీసులు, సంస్థల విషయంలో పెట్టిన ఖర్చును 2:1 దామాషాలో కేటాయించాలి. రాజధానిలో సెక్రటేరియట్, గవర్నరు, మంత్రులు, శాసన సభ కార్యాలయాలు వున్నాయి. గనుక ఈ విధమైన ఏర్పాటు సమంజసమైనదే. ఇంతేగాక వైద్య, విద్యాశాఖ డైరెక్టరేట్లు పోలీసు ఇన్స్పెక్టరు జనరల్ వంటి ప్రధాన కార్యాలయాలు హైదరాబాదులోనే నెలకొని వున్నాయి కనుక వీటిపైన పెట్టే ఖర్చు కూడ 2:1 దామాషాలో వుండడం న్యాయమైనదే. సమిష్టి సర్వీసుల నుంచి వచ్చే ఆయవ్యయాలను కూడా ఈ పద్ధతిలో కేటాయించడం న్యాయంగా వుంటుంది.

## కార్మికుల రాష్ట్ర జీవిత భీమా పథకం

ఈ పథకం క్రింద ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో అనేక సంస్థలు ముఖ్యంగా వైద్య చికిత్సాలయాలు అరంభించబడినాయి. వీటిపై ప్రభుత్వం పెట్టిన ఖర్చును కార్మికుల రాష్ట్ర జీవిత భీమా పాక్షికంగా భరిస్తుంది. ఈ ప్రకారంగా ఈ సంస్థ చెల్లించే డబ్బు హైదరాబాదులో జమ అవుతుంది. హైదరాబాదులో జమ అయిన డబ్బును ఏ ప్రాంతానికి ఎంత కేటాయించవలసిందీ నిర్ణయించడానికి, ఈ పథకం క్రింద ఈ రెండు ప్రాంతాలలో జరిగిన ఖర్చును, నిష్పత్తి ప్రకారం మేము కేటాయించినాము.

## రోడ్డు రవాణాసంస్థ బండ్లపై పన్ను ఆదాయం

ఆంధ్ర ప్రాంతంలో నడిచిన రోడ్డు రవాణా సంస్థ బండ్లకు చెల్లించిన ఆదాయం పన్ను హైదరాబాదులో జమకట్టడం జరిగిందని కనుక ఈ ఆదాయాన్ని తెలంగాణా ప్రాంతానికి చెందినట్లుగా చూపడం అన్యాయమని ఆంధ్రప్రతినిధులు మాకు ఫిర్యాదు చేశారు. మేము ఈ విషయమై పరిశీలన చేసినాము. ఒక్క రెండు సంవత్సరాలు మాత్రమే ఆంధ్రలో నడిచిన బండ్లపై పన్నులను హైదరాబాదులో జమ కట్టడం జరిగింది. మిగతా సంవత్సరాలలో ఆంధ్ర ప్రాంతంలో నుంచి రావలసిన ఈ పన్నులు ఆ ప్రాంతంలోనే జమకట్టబడినాయి. తెలంగాణా ప్రాంతంలో నడిచిన బండ్లపైన పన్నులు తెలంగాణాలోనే జమకట్టబడినాయి. ఈ రెండు సంవత్సరాల పన్నుల విషయంలో ఏ ప్రాంతానికి చెందినదానిని ఆ ప్రాంతానికి కేటాయించడం జరిగింది.

## విద్యుచ్ఛక్తి సంస్థ

రాష్ట్రమంతా వ్యాపించిన విద్యుచ్ఛక్తి సంస్థ యొక్క మూలధనంఖర్చు, రెవిన్యూ ఆదాయాలను ఉభయప్రాంతాలకు కేటాయించే విషయమై తీవ్రమైన వివాదం ఏర్పడింది. విద్యుచ్ఛక్తి సంస్థ కార్యకలాపాలను ప్రత్యేకంగా ఒక ప్రాంతానికి మాత్రమే చెందినట్లుగా భావించరాదనీ, రాష్ట్రమంతటికీ ప్రయోజనకారిగావున్న ఈ సంస్థను ఒకే యూనిట్‌గా తీసుకోవాలని, కనుక మూలధనం, ఖర్చును 2:1 దామాషాలో పంచిపెట్టాలని తెలంగాణా ప్రతినిధులు మా సమక్షంలో నివేదించారు. అంతే కాకుండా ఈ సంస్థయొక్క రెవిన్యూ ఆదాయం ఖర్చులను అసలు లెక్కలోకి తీసుకోరాదని కూడా వారు వాదించారు. ఇందుకు వారు చూపిన కారణం ఇది :- ప్రభుత్వ పద్దుపైన చేసిన ఖర్చును ప్రాతిపదికగా తీసుకొని తెలంగాణా మిగులు నిధులను నిర్ణయించాలి. మిగులు నిధులను నిర్ణయించడానికి రాష్ట్ర ఆదాయానికి సంబంధంలేని ఇతర అంకెలను, రాష్ట్ర బడ్జెటులు, అక్కౌంట్లలో పేర్కొనని అంకెలను లెక్కలోకి తీసుకోవటం న్యాయంకాదు. అయితే ఈ వాదన మాకు అంగీకారయోగ్యముగా లేదు. ఎందుకంటే విద్యుచ్ఛక్తి సంస్థ ప్రభుత్వ కార్యకలాపాలను కొనసాగిస్తున్న చట్టబద్ధ సంస్థ. కనుక దీనిని ప్రభుత్వ శాఖతో సమానంగా చూడాలి. బోర్డు చేసిన పెట్టుబడులను ప్రభుత్వ పెట్టుబడులుగా పరిగణించ వలసివుంటుంది ఈ సంస్థ గడించిన ఆదాయం, పెట్టిన ఖర్చులను ప్రభుత్వ ఆయవ్యయాలుగా లెక్కలోకి తీసుకోవాలి.

విద్యుచ్ఛక్తి సంస్థ చేసిన పెట్టుబడి ఖర్చుకు సంబంధించినంతవరకు, తెలంగాణా ప్రాంతంచేసిన వాదన ఈవిధంగా వుంది: విద్యుచ్ఛక్తి సంస్థ రాష్ట్రంలో నిర్వహిస్తున్న హైటెన్షన్ లైనులు ఒకే యూనిట్ క్రిందికి వస్తాయి. విద్యుచ్ఛక్తి పథకాలన్నీ ఒకే ఒక

గ్రిడ్‌ను అనుసరించి పనిచేస్తున్నాయి. కనుక రాష్ట్రానికంతటికీ ప్రయోజనకారిగా వున్న దీనిని ఒకే యూనిట్‌గా పరిగణించాలి. ఈ వాదనకూడా మాకు అంగీకార యోగ్యముగా లేదు. ఒక గ్రిడ్ ద్వారా రాష్ట్రానికంతటికీ విద్యుచ్ఛక్తి సరఫరా చేయడం జరుగుతున్నప్పటికీ విద్యుచ్ఛక్తి సరఫరా ఆధారాలను వేరువేరుగా నిర్ణయించవచ్చని, విద్యుచ్ఛక్తి సంఘ అధ్యక్షులు, అధికారులు అందజేసిన సమాచారాన్ని బట్టి మాకు తెలుస్తున్నది. ఒకే కేంద్రం నుంచి ఉభయప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా అవుతున్న సందర్భాలలో ఏ ప్రాంతానికి ఆ ప్రాంతం వివరాలు వేరు వేరుగా చూపవచ్చనికూడా వారు మాకు అందజేసిన సమాచారాన్ని బట్టి తెలుస్తున్నది. కనుక ఈ విషయమై ఏ ప్రాంతంలో ఎంత అభివృద్ధి ఖర్చు జరిగినదీ లెక్క కట్టవచ్చు. తెలంగాణా వాదాన్ని అంగీకరించి, విద్యుచ్ఛక్తి సంఘాన్ని ఒకే యూనిట్‌గా తీసుకొన్నట్లయితే, వివిధ పథకాలకై జరిగిన ఖర్చులను కేటాయించే విషయంలో చిక్కులు ఏర్పడతాయి. జనాభా ప్రాతిపదికపై, 2:1 నిష్పత్తిలో వీటిని కేటాయించడం కూడా న్యాయసమ్మతం కాజాలదు. ఎందుకంటె విద్యుచ్ఛక్తి వినియోగం జనాభా ప్రాతిపదికపైన వుండదు. ప్రతి ప్రాంతంలో వున్న విద్యుచ్ఛక్తి యూనిట్లను ఆధారంగా తీసుకొని కూడా ఉభయప్రాంతాలకు కేటాయింపు చేయడం న్యాయంకాదు. ఎందుకంటె విద్యుచ్ఛక్తి వినియోగం ఏ రోజు కారోజు మారవచ్చు ముందు ముందు కొన్ని ప్రాంతాలు అభివృద్ధి చెందడం లేక కొత్త పరిశ్రమలు నెలకొల్పటం జరిగినప్పుడు, ఇప్పటి పరిస్థితికి ముందు ఏర్పడే పరిస్థితికి ఎంతో తేడా వుంటుంది. విద్యుచ్ఛక్తి వినియోగాన్ని ప్రాతిపదికగా తీసుకొని ఆదామాషాలో మూలధనం కేటాయించడం న్యాయంకాదు, ఎందుకంటే, విద్యుచ్ఛక్తి వినియోగ పరిమాణం మారినప్పుడు నిష్పత్తి కూడా మారుతుంది. కనుక విద్యుచ్ఛక్తి సంఘ కార్యకలాపాలు. అవి అమలు జరిగిన ప్రాంతాలను బట్టి వేరువేరుగా వున్నట్లు పరిగణించడం సమంజసమని మా అభిప్రాయము.

కొత్తగూడెం, శ్రీశైలం విద్యుచ్ఛక్తి స్టేషనలు తప్ప మిగతా విద్యుచ్ఛక్తి పథకాలు ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలకు వేరువేరుగా వున్నట్లు విద్యుచ్ఛక్తి సంస్థ అధ్యక్షులు, ఆయన ఇతర అధికారులతో జరిపిన చర్చలవల్ల మాకు తెలిసింది. కనుక ఈ పథకాల ద్వారా ఏ ప్రాంతానికి ఎంత విద్యుచ్ఛక్తి సరఫరా అవుతుంది, అందుకు పెట్టిన మూలధనం ఖర్చు ఎంత అని ఉభయ ప్రాంతాలకు వేరువేరుగా లెక్కలు చూపవచ్చు కొత్తగూడెంలో ఏర్పాటైన విద్యుచ్ఛక్తి స్టేషను ముఖ్యంగా తెలంగాణా కొరకు ఉద్దేశించబడింది. అయితే ఇందులో కొంతభాగం ఆంధ్ర ప్రాంతానికి కూడా సరఫరా అయ్యేట్లు కనెక్షనులు ఉన్నాయి కనుక ఇట్టి పరిస్థితులలో ఇందుకైన మూలధనం పెట్టుబడిలో మూడింట రెండు వంతులు తెలంగాణాకు మిగతా భాగాన్ని ఆంధ్రకు కేటాయించడం భావ్యమని మేము భావిస్తున్నాము. ఇందుకు భిన్నంగా వుంది. శ్రీశైలం పవర్ హౌస్ విషయం ఇది ముఖ్యంగా ఆంధ్రప్రాంతానికి ఉపకరిస్తుంది. ఇందులో మూడోవంతు మాత్రమే తెలంగాణాకు సరఫరా అవుతుంది. శ్రీశైలం విషయంలో జరిగిన పెట్టుబడి ఖర్చులను ఆంధ్రకు మూడింట రెండు వంతులు, తెలంగాణాకు మూడింట ఒక వంతును కేటాయించినాము.

— సశేషం

## పరిపాలనా విషయాలు

### ఇండ్లస్థలాల కొరకు భూముల సేకరణ

నిమ్న జాతులు, నిమ్న తెగలు, జాబితానుంచి తొలగించబడిన తెగలు, సంచార తెగలకు ప్రయివేటు సంప్రదింపుల ద్వారా ఇండ్లస్థలాలను సమకూర్చడం కొరకు ప్రభుత్వం భూములను సేకరించడానికి సంబంధించిన డాక్యుమెంట్ల విషయంలో రిజిస్ట్రేషను ఫీజు తీసుకోరాదని ప్రభుత్వం ఉత్తర్వు చేసింది. పైన పేర్కొన్న విధంగా ఇండ్ల స్థలాలను సమకూర్చే సందర్భంలో మంజూరు చేసిన ఎన్‌కంబరన్సు సర్టిఫికెట్ల విషయంలో పబ్లిక్ ఆఫీసరుకు పెట్టుకున్న దరఖాస్తును సాధారణంగా పరిశీలించినప్పుడు ఫీజు చెల్లించనవసరంలేదని కూడా ప్రభుత్వం ఆదేశించింది.

సీరియల్

# మన చరిత్ర సంస్కృతి

## విజయ వీచికలు

సంగమ వంశం వారయిన హరిహరరాయలు, బుక్కరాయలు, వారి సోదరులు కలిసి స్థాపించిన విజయనగర రాజ్యాన్ని నాలుగు వంశాల వారు పాలించారు. వీటిలో ముఖ్యమైనది తుళువ వంశం. మన ఆంధ్రభోజుడు శ్రీ కృష్ణదేవరాయలు యీ తుళువ వంశానికి చెందిన వాడు. తుళువ వంశపు వీర నరసింహరాయలు మరణించిన తరువాత ఆయన స్థానంలో ఆయన తమ్ముడు కృష్ణదేవరాయలను విజయనగర సింహాసనం ఎక్కించిన వాడు సాళువ తిమ్మరుసుమంత్రి. కృష్ణదేవరాయలను సింహాసనం ఎక్కించి మహోన్నతమైన ఆంధ్ర సామ్రాజ్య నిర్మాణానికి రాజమార్గాలను వేసిన తిమ్మరుసు మంత్రి ధీయుక్తికి ప్రతి



హనుమకొండ వేయి స్తంభాల దేవాలయం

ఆంధ్రుడు పారవశ్యంతో అంజలి ఘటించక మానడు. కృష్ణదేవరాయలు మహావీరుడు, యుద్ధతంత్రంలో దిట్ట. ప్రధాని సాళువ తిమ్మరుసయ్య గొప్ప రాజ్యతంత్రజ్ఞుడు. ఇక ఆంధ్ర సామ్రాజ్యవైభవానికి అడ్డేమున్నది? కృష్ణదేవరాయల కాలంలో ఆంధ్రసామ్రాజ్య దిగ్జయ పతాకం యిటు ఉత్తరాన కటకంలో ప్రతిష్ఠాపితమైంది; అటు దక్షిణాన తంజావూరులోను, మధురలోను తమ ప్రతినిధులుగా పాలించడానికి విజయనగరాధీశులు తెలుగు నాయకులను నియమించారు. ఇవే తరువాతి కాలపు మధుర, తంజావూరు తెలుగు రాజ్యాలుగా రూపొందినవి. ఇదే కాలంలో మన ఆంధ్రులు, అన్ని వర్ణాలవారు, దక్షిణ దేశమంతటా వ్యాపించి రాచరికం చేశారు. తుంగభద్రా తీరాన హంపీ విరూపాక్ష క్షేత్రంలో ఆనాడు విజయనగర సామ్రాజ్యానికి రాజధానిగా విలసిల్లిన విజయనగర వైభవాన్ని గురించి వర్ణించనలవిగాదు. విజయనగర వీధుల్లో రత్నాలను రాసులుగా పోసుకొని వర్తకం చేసేవారట. దేశం తెలుగుదేశం, నేను తెలుగు వల్లభుణ్ణి. దేశభాషలందు తెలుగు లెస్స అని స్వయంగా కవిపండితుడై చాటి చెప్పిన కృష్ణదేవరాయలు నిజంగానే ఆంధ్రభోజుడు. ఆయన భువన విజయంలో, అష్టదిగ్గజాల అలనలో తెలుగు సాహిత్యలలామ రాజభోగాలతో రాణించింది. సంగీతము, నృత్యము, శిల్పము, చిత్రలేఖనము వంటి కళలు నూతన శోభతో వెలుగొందినవి. వ్యవసాయం, వర్తక వ్యాపారాలు ఎంతో అభివృద్ధి పొంది




త్యాగరాజు

నవి. అన్ని మతాలు సమానమైన ఆదరాన్ని పొందినప్పటికి వైష్ణవ మతం ప్రత్యేకమైన ఆదరాభిమానాలతో ప్రాబల్యాన్ని సంపాదించింది అనాటి వైభవాన్ని రసికతను ఆంధ్రజాతి ఎన్నడూ విస్మరించలేదు.

## గోలకొండ రాజ్యం

విజయనగరం తరువాత ఆంధ్రజాతి అదృష్టదీపం తిరిగి మరొకసారి గోలకొండలో వెలిగింది. గోలకొండ రాజ్యచరిత్ర అంటే మహమ్మదీయ సుల్తానుల పరిపాలనలోని ఆంధ్రదేశ చరిత్ర అన్నమాట. మహమూద్ బహ్మనీ సుల్తాను కొలువులో పనిచేస్తున్న పర్షియా దేశస్థుడు మలిక్ కులీ కుతుబుల్ ముల్క్ ఒకసారి మహమూద్ బహ్మనీ సుల్తానును అంతః కలహాల ప్రమాదం నుండి రక్షించడం జరిగింది. ఇందుకు కృతజ్ఞతగా బహ్మనీ సుల్తాను కుతుబుల్ ముల్క్‌ను తెలంగాణాకు అధిపతిగా నియమించాడు. గోలకొండ రాజధాని కుతుబుల్ ముల్క్ తెలంగాణాను పాలిస్తుండేవాడు. బహమనీ రాజ్యం విచ్ఛిన్నం అయిన తరువాత క్రీ.శ.1512లో మలిక్ కులీ కుతుబుల్ ముల్క్ సుల్తాను కులీ కుతుబ్‌షా అనే పేరుతో గోలకొండను స్వతంత్ర రాజ్యంగా ప్రకటించుకొన్నాడు. కొన్ని సంవత్సరాల తరువాత తూర్పు తీరంలోని పూర్వాంధ్రదేశం గూడ గోలకొండ రాజ్యం ఆధీనం లోనికి వచ్చింది. క్రీ.శ. 1550లో గోలకొండ సింహాసనం ఆక్రమించిన ఇబ్రహీం కులీ కుతుబ్‌షా అతని తరువాత 1580లో రాజ్యానికి వచ్చిన కులీకుతుబ్‌షా వీరు భయులూ పూర్వాంధ్రదేశాన్ని, రాయలసీమ తూర్పు ప్రాంతాన్ని తమ స్వాధీనం చేసుకొన్నారు. నిజానికి తెలుగు దేశమంతా ఈ విధంగా గోలకొండ రాజ్యం క్రిందికి వచ్చిన తరువాతనే అంటే ఇబ్రహీం కులీకుతుబ్‌షా కాలం నుంచే గోలకొండ రాజ్యప్రభ కోహినూరు వజ్రంవలె దేదీప్యమానంగా వెలిగింది భోగభాగ్యాలు ఎన్ని ఉన్నా గోలకొండలో నీటికి మాత్రం ఎద్దడిగా ఉండేది అందువల్ల ఆయన మూసీనదికి ఆనకట్టకట్టించి గోలకొండకు గొట్టాల ద్వారా వలసినంత నీటిసరఫరాను ఏర్పాటుచేశాడు. తన ప్రేయసి భాగ్యమతిపేర మూసీతీరాన కులీకుతుబ్‌షా భాగ్యనగరాన్ని కట్టించాడు. ఇదే నేటి మన అందాల హైదరాబాద్. అటు తరువాత మరికొంత కాలానికి అబ్దుల్లా కుతుబ్‌షా కాలంలో గోలకొండ రాజ్యం గంజాం వరకు విస్తరించింది. గోలకొండ ఆంధ్రరాజ్యమే.

గోలకొండ చివరి ప్రభువు తానీషాగా ప్రసిద్ధుడైన అబ్దుల్ హసన్ కుతుబ్‌షా. 1672లో గోలకొండ సింహాసనం ఎక్కిన తానీషాకు మాదన్న ప్రధానమంత్రి; అక్కన్న సర్వసైన్యాధిపతి. తానీషా, అక్కన్న, మాదన్నలు, గోపన్న, భద్రాచలం ఆలయాలు, సీతారామ లక్ష్మణులు తెలుగు ప్రజలకు సుపరిచితులే. తెలుగు దేశంలోని ఆబాల గోపాలం నాలుకలమీద వారి పేర్లు అనుక్షణం నాట్యమాడుతుంటాయి. కుతంత్రాలతో వంచనతో, అధర్మయుద్ధంచేసి తొమ్మిది నెలలు నిరంతర దండయాత్ర తరువాత 1687లో ఔరంగజేబు గోలకొండ కోటను స్వాధీనంచేసుకొని కొల్లకొట్టాడు. గోలకొండ పతనంతో తెలుగు దేశమూ, తెలుగు ప్రజల సిరిసంపదలూ ఔరంగజేబు వశమైనవి.



కట్టమంచి



గురజాడ

## సమైక్యతా సంస్కృతి

గోలకొండ పాదుషాల పాలనలో హిందువులూ, మహమ్మదీయులూ సోదరులవలె కలసి మెలసి జీవించారు. అప్పుడే సమైక్యతా ప్రధానమైన ఒక ఉత్తమ సంస్కృతికి అంకురార్పణ జరిగింది. గోలకొండ ప్రభువుల కొలువులో తెలుగు వారికి చాలా ప్రాధాన్యం ఏర్పడింది. హిందూ పండితులను, కవులను, వేదవిద్యలను గూడా కుతుబ్‌షాహి పాదుషాలు గౌరవాభిమానాలతో పోషించారు. అప్పుడు ఫారసీ రాజభాష అయినా సుల్తానులు తమ ప్రజలభాష అయిన తెలుగును చక్కగా అభ్యసించారు. తెలుగు భాషకు, తెలుగు కవులకు గోలకొండలో గొప్ప ఆదరణ దొరికింది. అద్దంకి గంగాధరకవి, పొన్నికంటి తెలగన్న, కందుకూరి రుద్రకవి యీ కాలపు కవులు. తెలుగు కవుల కావ్యాలలో ఇబ్రహీం కుతుబ్‌షా ఇభరాముడయినాడు. గోలకొండ తెలుగు రాజ్యమయింది, గోలకొండ పాదుషాలు తెలుగు ప్రభువులయినారు. ఔరంగజేబుకు యీ పరిస్థితి యెంత మాత్రం నచ్చలేదు; ఆయన అసూయకు, దురాక్రమణకు అదే ప్రధానకారణం.



రాధాకృష్ణన్



ప్రకాశం

## గుండె కోత గాయాలు

దక్కనులోని యితర పరగణాలతోపాటు గోలకొండ రాజ్యం గూడా మొగలాయిల పాలనలోకి వచ్చింది. దక్కనులో మొగలాయి సుబేదారుల పాలన ప్రారంభమైంది. దక్కనులో సుబేదారుగా ఉన్న చిన్‌కిలిక్ ఖాన్ అనే ఆసఫ్‌జా నిజాముల్ ముల్క్ 1724లో ఢిల్లీ పాదుషా సైన్యాలను ఓడించి స్వాతంత్ర్యం ప్రకటించుకున్నాడు. అప్పటినుంచి దక్కనులో ఆసఫ్‌జా నిజాముల్ ముల్క్ స్వతంత్రపాలన ప్రారంభమైంది. ఈయన రాజధాని మన హైదరాబాద్. అంటే మన సకలాంధ్ర దేశం ఆనాటి నుంచి ఆసఫ్‌జా వంశం వారి పాలనలోనికి వచ్చిందన్నమాట. మొదటి ఆసఫ్‌జా మరణించిన తరువాత నుంచి సింహాసనం కొరకు తగవులు ప్రారంభమైనవి. ఈ తగవులలో ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు జోక్యం చేసుకోవడం, కుట్రలుపన్నడం మొదలైనవి జరిగినవి. ఈ కుట్రల ఫలితంగానే సలాబత్‌జంగ్ కాలంలో తూర్పు ఆంధ్రదేశమూ (సర్కారు జిల్లాలు). అటుతరువాత నిజామలీ కాలంలో టిప్పుసుల్తానుతో 1799లో జరిగిన శ్రీరంగపట్నం యుద్ధంలో రాయలసీమ ప్రాంతమూ ఇంగ్లీషువారి వశంలోకి వచ్చినవి. అప్పటి వరకు గోలకొండ రాజ్యంలోనూ, తరువాత ఆసఫ్‌జాల హైదరాబాద్ రాజ్యంలోనూ ఒకే పాలనక్రింద ఉన్న తెలుగు దేశం 1799లో తిరిగి రెండు ముక్కలయింది. ఇందులో ఒక భాగం అయిన తెలంగాణా హైదరాబాద్ రాజ్యంలో మిగిలిపోయింది. మరొకభాగం ఇంగ్లీషువారి పాలనక్రిందకు వెళ్లింది. పరదేశీయుల రాజ్యకాంక్షకూ, తదనుగుణమైన వారి కుట్రలకూ ప్రతిఫలంగా ఒకగుండె రెండుముక్కలైనట్లు తెలుగుజాతి రెండుగా చీలింది.

(సశేషం)



# వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్

## శతజయంతి శ్రద్ధాంజలి

స్పందించే ట్యూనింగ్ ఫోర్క్
భూకంపాల కేంద్రాలను
కరెక్టుగా రికార్డుచేసే సిస్మోగ్రాఫ్
సీలువేసిన రైలు పెట్టెలో డైనమైట్

విప్లవానికి మంత్రసాని
గురువు, మహామనస్వి
మనిషి, మనీషి లెనిన్.

ధరణి పరమాణు వైతే
దానిలో లెనిన్ మీసాన్
ప్రపంచమనే పద్మంలో
పరిమళం లెనిన్

ప్రపంచమనే కావ్యానికి
ప్రతి పదార్థం లెనిన్
బ్రదుకనే చిక్కుసమస్యకి
పరిష్కారం లెనిన్

మానవ మహా సముద్రంలో
ప్రవాళద్వీపం లెనిన్
మానవ ప్రవాళంలో
మండే ఎర్రదనం లెనిన్......
నూరేళ్ల వయస్సునికాదు అతనికి నా సెల్యూట్
అతడే మనఆశ: అందుకే నా సెల్యూట్
అతడే మన ధ్రువతార: అందుకే నా సెల్యూట్.

—శ్రీశ్రీ

ఈ శతాబ్దారంభంలో రష్యాలో వచ్చిన సోషలిస్టు విప్లవం ఒక్క రష్యానే కాక ప్రపంచంలోని అనేక దేశాల మీద తన ప్రభావాన్ని ప్రసరింప జేసింది. వివిధ వర్గాల ప్రజల ఆలోచనా రీతులను తన వైపు ఆకర్షించు కున్నది. అనేకమంది ప్రపంచ మేధావులను ఆకట్టుకున్నది.

అంతవరకు మానవ జాతి విశ్వసిస్తున్న విలువల పునాదులు కదిలాయి. మరో ప్రపంచపు భవన ద్వారాలు తెరుచున్నాయి.

ఈ జనతా సమాజ రథ సారథి, ప్రపంచ ప్రథమ సోషలిష్టు రాజ్య స్థాపకుడు, అంతర్జాతీయ కార్మిక వర్గనాయకుడు, మహా మానవతావాది.

## వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్

లెనిన్ జన్మించి వంద ఏండ్లయింది, ఆయన ప్రచారం చేసిన విప్లవ భావాలు నేటికీ ప్రపంచ మానవాళిని ఉత్తేజపరుస్తున్నాయి.

"ప్రజల మీద విశ్వాసం వున్నవారినీ, సృజనాత్మక కార్య కలాపాలలో విమగ్నమైవున్న వారిని మాత్రమే విజయంవరిస్తుంది" అని లెనిన్ విశ్వసించాడు. ప్రజల పట్ల, వారి సృజనాత్మక శక్తి పట్ల ఆయనకు అపరిమితమైన గౌరవం వుండేది. "సోషలిజం అన్నది పైనుంచి వచ్చేదేమీ కాదు. యాంత్రికమైన నియంతృత్వ పద్ధతిని అది తిరస్కరిస్తుంది, సజీవమైన సామ్యవాదం ప్రజల నుంచే ఉద్భవిస్తుంది." అని ఆయన సోషలిజానికి నిర్వచనం యిచ్చాడు. అణకువ, వినయత, నిరాడంబరత ప్రధాన లక్షణాలు గల వ్యక్తిత్వంతో లెనిన్ రష్యాలోనే కాక యితరదేశాల ప్రజల అభిమానాన్ని కూడా చూరగొన్నాడు.

అనుసరించిన మార్గాలు వేరైనా ఒకే లక్ష్యంతో యిర వయ్యో శతాబ్దపు చరిత్రను శాసించిన మహనీయులు–గాంధీజీ, లెనిన్, కొద్ది తేడాతో, యీ యిద్దరు ప్రజానాయకుల శతజయం త్యుత్సవాలు ఏక కాలంలోనే వచ్చాయి.

1970 ఏప్రిల్ 22 వ తేదీన ప్రపంచ వ్యాప్తంగా లెనిన్ శతజయంత్యుత్సవాలు జరిగాయి.

మానవ జాతికి సరిక్రొత్త వెలుగుదారులు చూపిన మహనీయ విప్లవ యోధుడు లెనిన్‌కు యిదే శ్రద్ధాంజలి,

---

## లెనిన్ శతజయంతి ఉత్సవాలు

ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని రష్యా భాషా విద్యార్థి సంఘంవారు యూనివర్సిటి ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల ప్రిన్సిపాల్ డాక్టరు ఆర్యేంద్ర శర్మ అధ్యక్షతన ఏప్రెల్ 23న, లెనిన్ శతజయంతి ఉత్సవం జరుపుకున్నారు.

లెనిన్ జీవితంలో వివిధ ఘట్టాలను చిత్రించే చిత్ర పటాల ప్రదర్శనకు వైస్ ఛాన్సలరు డాక్టరు రావాడ సత్యనారాయణ ప్రారంభోత్సవం చేశారు. పార్లమెంటు సభ్యుడు డాక్టరు రషీరుద్దీన్, డాక్టరు గౌతమ్ మాధుర్, స్థానిక ప్రయివేటు కంపెనీలో పనిచేసున్న రష్యా ఇంజనీర్లు, విజిటింగ్ రష్యన్ ఆచార్యులు ఆ సమావేశంలో పాల్గొన్నారు.

*     *     *

లెనిన్ శత జయంతి సందర్భంగా ఏప్రెల్ 19 న, నెల్లూరు వి. ఆర్. కళాశాలలో ఇండో–సోవియట్ కల్చరల్ సొసైటీ ఆధ్వర్యాన గోష్ఠి జరిగింది. డాక్టర్ పి. మధుసూదనశాస్త్రి స్వాగతం చెప్పారు. శ్రీయుతులు బి. ఆర్. కె. రావు, ఎం. వి. నారాయణరావు మొదలగు వారు ప్రసంగించారు. ప్రిన్సిపాల్ శ్రీ ఆర్. సుబ్బారెడ్డి అధ్యక్షత వహించారు.

*     *     *

శ్రీ టి. వెంకటేశ్వరరావు అధ్యక్షతన గుడివాడలో లెనిన్ శతజయంతి జరిగింది.

సోవియట్ వైస్–కౌన్సల్ శ్రీ వి. పోప్రిలోవ్, శ్రీ కె. రాజ బాపయ్య, ఉప్పల లక్ష్మణరావు, డాక్టరు పి. చిరంజీవినీ కుమారి, శ్రీ బి. వి. రావు ప్రసంగించారు.

---

# గాంధీచరిత్ర-హరిజనోద్ధరణ

## బొమ్మలాట నాటక ప్రబంధం: యక్షగానం

—ఆరుద్ర

ప్రార్ధన

దిక్కాలాదుల లెక్కకు
చిక్కక యనుభూతి కందు చిన్మాత్రమ్మౌ
చక్కని శాంతము తేజము
నొక్కడ వినుతింతు ననయ మూర్జిత మదితోన్.

నిరాకారంబును, నిర్గుణంబును, నిరవధికంబును, నిఖిలంబైన పీత త్తేజస్సునకు లాంఛన ప్రాయ చిహ్నంబులని భావించంబడు దేవతా మూర్తులలో ప్రథముండును, ప్రముఖుండునగు గణాధిపతిని సాంప్రదాయ సిద్ధంబుగా ప్రార్థించుట యెటువలెనన్న:
వినాయకుని బొమ్మ

అగజానన పద్మార్కం గజానన మహర్నిశం
అనేకదం, తం భక్తానా మేకదంత ముపాస్మహే ॥

తెరమీద బొమ్మ ఎక్కిస్తూ,

దరువు

సాహో గణనాయకా! జయమొసగు
మోహనా శుభదాయకా!
హే హే రంభ! ప్రారంభ పూజల
కాలంబమగు ఏలికా ॥సా॥



విఘ్నము లాపెడు వెనకయ్యా, వే
వేగమె ముందుకు రావయ్య
రుగ్ణభీతీ రహిత స్నిగ్ధ సదాశయ
మగ్నుల గావించి మము నడుపవయ్యా ॥సా॥

కొన్నకోర్కెలు—తీర్మానం

[ తెరమీద భారతమాత బొమ్మ. భారతీదేవి బొమ్మ ఎక్కించేముందు ]

శ్లోకం

భారతమాత బొమ్మ :

జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి
భారతీం భరతోర్వీంచ వందేహం దివ్యమాతరా॥

బొమ్మలెక్కిస్తూ—

దరువు

అంబా పరాకు! దేవీ పరాకు
అనయము మమ్మేలు భారతాంబా పరాకు



కురులలో సిరిమల్లె విరుల కై వడి_హిమ
గిరులను దాల్చెడి తరుణీ పరాకు ! తల్లీ పరాకు !
ఒడ్డాణము పగిది విడూరమగు వింధ్య
నొడ్డోలముగ దాల్చు వియుదా పరాకు! ఒజ్జపరాకు !

గంగా యమునా కృష్ణ కావేరి గోదా త
రంగాల హారాల రమణీ పరాకు! రాణీ పరాకు !
పాడిపంటలు సిరులు పాడి తప్పని జనులు
పాడియాడగ గన్న భామా పరాకు ! భూమీపరాకు !

కొన్ని శ్లోకాలు - నిర్మానం.

సూత్రధారుని బొమ్మ

సంధివచనం : అహ హ : ఏమయ్యా ? మనమిప్పుడు కట్టి ఆడబోవు ఈ యొక్క గాంధీ చరిత్ర బొమ్మలాట నాటక యక్షగాన ప్రబంధంబునకు దీవన లివ్వంగా ఆ యొక్క జనగణ మన అధినాయకుండు గణనాయకుండునూ సువర్ణమ్ములతోనూ సుప్రసన్న సుందర రస భావ బంధురవచో విలాసమ్ములతోనూ భారతీదేవియున్నూ భారత మాతయున్నూ విచ్చేసియున్నారు. కాబట్టి ఇక్కడ ఎవరురా వేత్రహస్తుడు?

వేత్రహస్తుడు : అహ ! నేనయ్యా ఉన్నాను యేమి ?

సూత్రధారుడు : ప్రజలు ప్రజానాయకులు, కళాకారులు, కళా రాధకులు, దాతలు, నేతలు, మున్నగు ఆ బాల గోపాలమ్ము వినోదా సక్తులై విచ్చేసియున్న ఈయొక్క నాట్యరంగమ్మునకు ఆ యొక్క హాస్యగాని భార్య, ఏమి _రుకల బంగారు, తళుకుల బంగారు, పలుకుల బంగారు, కులుకుల బంగారు ఆ యొక్క వధ్నాలగో ఎన్నెబంగారు, ఫోర్డీనుకేరట్టు బంగారు యెక్కడ వున్నదో ఏ గ్రామములో నున్నదో ముందుగా పిలిపించవచ్చునా సభాపతులూ.

వంత : అహా_అహా

సూత్రధారుడు : ఓయమ్మా_బంగారు !

బంగారు బొమ్మ అత్రంతో_

బంగారు : ఓ ! ఏమన్నా ఏమన్నా_ఏమన్నా ఎందుకన్నా.

సూత్రధారుడు : మా అయ్యగారు ఇట్లా సెలవిచ్చి యున్నారు కాబట్టి, కాళ్ళకు గజ్జలు కట్టుకొని, కళ్లకు కాటుక పెట్టుకొని అందము చేత చందము చేత అలంకరించరావే బంగారూ

బంగారు : ఓ !

గురువు

బంగారు పేరున రంగారు దానను
భామలారా ! ఓయమ్మా !
సంగీత మెరుగుము_ఇంగిత మెరుగుదు
చానలారా ! ఓయమ్మా !
కొంగున భర్తను టంగున కట్టితి
కొమ్మలారా ! ఓయమ్మా !
గయ్యాళినని నన్ను_అయ్యయ్యో తలవొద్దు
కాంతలారా ! ఓయమ్మా !
వయ్యారి మగడిని_వక క్షణము విడువను
వనితలారా ! ఓయమ్మా !
తడబాటు ఎడబాటు_తాళంగ లేనమ్మ
తల్లులారా_ఓయమ్మ !
తాళగ ... ... తాళగ

[దురితంలో నాట్యం]

సంభాషణ

సూత్రధారుడు : ఓయమ్మా కస్తూరి బంగారు !

బంగారు : అహ. ఏమయ్యా? అదేమి?

సూత్రధారుడు : ఓయమ్మ బంగారు

బంగారు : అహ_అది నా పేరన్నా అంటే .....

సూత్రధారుడు : నీవుతొందరగా వచ్చివేసి ఆ యొక్క అయ్యగారి యొక్క సమ్ముఖాన నిలబడి స్వగతముగా గొణుక్కుంటున్నావేమి కారణార్థమ్ము

బంగారు : అయ్యో అన్నా ఏకన్ గ్రామమున్నదే ఈ గ్రామము నీళ్లు తాగినప్పటి నుంచీ నా ఒళ్లు మహావిరివంగా ఉన్నదంటే.

సూత్రధారుడు: ఆహా ! ఈయొక్క గ్రామమందు నీళ్ళు కొంచెం జవుకంగా వస్తున్న విప్పుడు. ఆ నీళ్ళు త్రాగినప్పటినుంచి నీ ఒళ్లు విరివంగా వున్నదిగావి_నీ పేరేమి ?

బంగారు: నా పేరు బంగారందురు

సూత్రధారుడు: నీ పేరు బంగారా లేక నీ దేహమంతా బంగారా?

బంగారు: అయ్యో ! నాపేరే బంగారు, నా దేహమంతా బంగారు కాదు.

సూత్రధారుడు: నీ దేహమంతా బంగారైనట్టయితే, బంగారు షాపు పెట్టి అమ్ముకుందా మనుకున్నాను.

వంత: ఔ_ ఔ.

బంగారు: పేరే బంగారు.

సూత్రధారుడు: నీవు ఒక్కదానవేనా లేక నీకు ఈడుజోడుగాడు ఎవడైనా వున్నాడా?

బంగారు: అయ్యో ! అదేమన్నా_నా యింటికిజోడు, వంటికి జోడు, కంటికిజోడు, కాలికిజోడు ఉన్నాడన్నా వున్నాడు.

సూత్రధారుడు: ఆహా ! అటువంటివాడు ఉన్నట్లయితే అయ్యగారి సెలవైనది కాబట్టి వాడిని తొందరగా పిలిపించు చేతనైతే.

బంగారు: ఓ అట్లాగే పిలుస్తాను

[వెనుకకు తిరిగి పిలువ వలెను.]

ఓయి మగడా ! రా మగడా ! నా

మగడా ! నా చల్లని భర్తా, చక్కని పురుషా.

దరువు

రమ్మంటే రావ దేల
రంతులేల ? రాసామి !
రంతులేలరా ! సామి
రావులేలరా ! సామి !
కోరి యెదుటావచ్చి నీవు
కోర్కె తీర్చుకుందువేమి
చక్కనయ్యా ! రారా !
చల్లనయ్యా ! రార !
అందగాడా ! రార ! [పోలిగాడు బొమ్మతెరమీద కనబడ వలెను]

పొందుగాడా ! రార !
వడివడిగా రార ?
హడావిడిగా రారా ! (తీర్మానం)

[జుట్టుపోలిగాడు తెర యెక్కురాడు, నవ్వులాడు]

బంగారు: అయ్యో ! నీ యొక్క పొడిదగ్గు చాలించు మగడా ! పొడిదగ్గు చాలించు !

పోలిగాడు. ప్రాణమా ! రత్నమా ! ముద్దుపెట్టు- ముద్దుపెట్టు.

బంగారు: ఏదీ పట్టు.

[వాళ్లు ముద్దుపెట్టుకుంటారు. వికటాట్టహాసాలు వినిపిస్తాయి]

పోలిగాడు: అ_ఏమయ్యా ! నేను నా భార్య సతీ పెళ్లాన్ని ముద్దు పెట్టుకుంటూవుంటే ఎవరయ్యా నవ్వుతున్నది.

సూత్రధారుడు: ఎవరైతే నేమయ్యా ! వెనక తుమ్ము ముందుకు పనికొచ్చినట్టు_వెనక నవ్వులు లాభిస్తాయి. ఏ కెందు కయ్యా బెంగ !

పోలిగాడు: ఔనౌను. భార్యా సతీ పెళ్ళామా ! నన్ను పిలిపించిన కారణార్థమేమి ?

బంగారు: అయ్యో అది కూడా చెప్పాలా ? ఈ గ్రామంలోని పెద్దలు, ఈ సభలోని ప్రభులు, అన్నదాతలు పిలిపించు బంగారూ అంటే పిలిచాను. మగడా దండంపెట్టు.

పోలిగాడు: సరా !

బంగారు: అయ్యో ! నాక్కాదు. సభకు దండంపెట్టు.

పోలిగాడు: ఆహా_అందరికీ, అందరికీ, యావన్మందికి నమస్కారాలు ఔనే ! భార్యా సతీపెళ్లామా? వచ్చినపని అయింది కాబట్టి మనం పక్కకు తప్పుకుందామా ?

బంగారు: ఆహా ! భర్తా పెనిమిటి మగడా ! నువ్వొస్తే సందడి లేదు. పిల్లాణ్ణి పిలిపించు.

పోలిగాడు: ఎవరు? ఎవరు. కేతిగాణ్ణా! ఆనివ్వ కూడదు మనమొస్తే పూరుకొన్నారుగాని వాడొచ్చి కారుకూతలు కూసి గలాభా చేసినట్లాయెనా దేహశుద్ధి చేస్తారు. పిల వొద్దు, పిలవొద్దు.

సూత్రధారుడు: ఏమోయి జుట్టుపోలిగాడా ! అసూయ మాట్లాడకు. నువ్వొస్తే ప్రభువులు మెచ్చలేదు. నవ్వలేదు. కరుణమవ్వలేదు కాబట్టి నీ యొక్క అల్లుకున్నాడే. బుడ్డకేతిగాడు, వచో చతురుడు, వ్యవహారజ్ఞుడు, గుండె దిటువు గలవాడు, పదిమందిలో తిరగనేర్చినవాడు, వాడు వస్తే ఏటుకు ఏటు, మాటకు మాట, పోటుకు పోటు ఇవ్వ గలడు. వాడిని పిలపనంపు.

పోలిగాడు: వాడు ఎక్కడవున్నాడో ఏమో

సూత్రధారుడు: ఇదుగో_ఇక్కడే అయ్యగారి వద్ద వున్నాడు. పిలువు.

పోలిగాడు: ఒరే_కేతిగా_కేతిగా హెయ్. [తల వెనుకకు త్రిప్పి పలుక వలెను.]

కేతిగాడు: హెయ్_మామా_మామా_హెయ్.

పోలిగాడు: ఏమిరా ? కేతిగా ఎక్కడ తిరుగుతున్నావురా ? ఏ మాలకూడు తింటున్నావురా?

కేతిగాడు: మాలకూడా? మాలకూడా? ఆ మాట అనవొద్దన్నానా?

దరువు

అనరాని మాటలంటే_అత్త మగడా ఊరుకోను
నోటికొచ్చిన తిట్లు తిడితే_చేతికొచ్చినదెబ్బ కొడతా
కలియబడితే కసిగాఉంటే_కచ్చితంగా చావగొడతా
జుట్టుకు జుట్టు_బాగా బాగా_నోర్_నోర్
చెయ్ చెయ్_గడ్డం గడ్డం_దెబ్బకు దెబ్బ
తోక_తోక......

[కేతిగాడూ, పోలిగాడూ పోట్లాడుకుంటారు. బంగారక్క విడదీస్తుంది.]

కేతిగాడు: ఏం మామా బుద్ధొచ్చిందా ?

పోలిగాడు: ఔరా కేతిగా నే నేమన్నానని ఇంత పోట్లాట కొచ్చావురా !

కేతిగాడు: మరో కులాన్ని నిందించవద్దన్నానా ? మాలకూడు మాలకూడని ఈసడించ కూడదన్నానా ? మాల మాదిగల వంటి కులాలన్నింటికి మహాత్మాగాంధి హరిజనులనే పేరు పెట్టారని చెప్పానా ? అది మరచిపోతే వూరుకుంటానా ?

బంగారు: అది సరేగాని, కేతిగా: హింసకూడదు, కొట్టకూడదని గాంధీగారు చెప్పారు కదా. ఆయన బోధించినవాటిని కొట్టి బోధించడం ఏం విడ్డూరంరా అల్లుడా!

కేతిగాడు: నిజమేనే అత్తా! మరిచిపోయాను. గాంధీగారు చెప్పినవన్నీ అందరూ జ్ఞాపకం పెట్టుకుంటే దేశం ఇలా ఎందుకుంటుంది

బంగారు: ఔను. ఔను. గాంధీగారు మహాత్ముడు దేశానికి, లోకానికి ముఖ్యంగా దిక్కూ మొక్కూలేని హరిజనులకు చేసిన మేళ్లు చెప్పుకోడానికేకదా ఈ యొక్క సభవారు ఇక్కడ ఇప్పుడొక బొమ్మలాట పెట్టిస్తున్నారు. నువ్వూ, నేనూ, నాయొక్క భర్త పెనివిటి మగడును కలసి మెలసి ఆ యొక్క ఆట చూద్దాం. కాబట్టి సభవారికి నమస్కరించు.

కేతిగాడు: ఔ ఔ అందరికీ — యావన్మందికీ, సభకు నమస్కారం.

[ బొమ్మలు — తెర దిగుతాయి ]

ద్విపద

శ్రీనగనాదిగా సేతువు దాకా
శోభిల్లు దేశీయ సోదరులార!
రాజనాల్ బండించ రాత్రింబగళ్ళు
కష్టించు జనులార — కర్షకులార:
వస్తువాహన నూత్న వస్త్రమ్ము లొసగి
ప్రజల సేవించెడు శ్రామికులార
వెలుగు బాటల సాగు విద్యార్థులార!
దేశోన్నతిని గోరు ధీనిధులార!
కవులార, నటులార — గాయకులార!
జన్మ ప్రసాదించు జనయిత్రులార
ఇళ్ళకు దీపమౌ ఇల్లాండ్రు లార!
ఆబాల గోపాల మాత్మీయు లార
భరత జాతికి పిత భాగ్యవిధాత
గాంధిమహాత్ముని కమనీయ చరిత
అమర సుకవి రసానంద రచన
బొమ్మలాటగ దీక్ష బూని యాడెదము
వేడుక మీరగా వీక్షించరయ్యా
దివ్య చిత్తవి తోడ దీవించరయ్యా

ఈ క్రమముగా నాందీ ప్రస్తావనలు గావించిన పిమ్మట — కథా సరళికి తెరమీది కెవరు వచ్చుచున్నారంటే:

పద్యం

ఆ॥ వె॥ ఒత్తియవాడు చీర కట్టొని చోళమ్ము
ముక్కు పుడక చాయ చెక్కు చెదక
కాంతులీను వెండి కడియాలు దంతపు
గాజుల ధరియించి కాంతె వచ్చె.

సంధి వచనం: ఒహోహో! చూడగానే చెయ్యెత్తి మొక్కాలనిపించే ఈ వనితారత్న మెవరయా. ఈ మాతృమూర్తి ఎవరయ్యా..

పద్యం

సీ॥ సతత చాతుర్మాస సద్వ్రతా చారిణి
కఠినోపవాస సత్కర్మ శీల
భాను సందర్శన భాగ్యంబు లేనిచో
భోనమ్ము ముట్టని పుణ్యమూర్తి
దేవతార్చన లేని దినము దుర్దినముగా
భావించి జీవించు భక్తురాలు
సాయక యే పొద్దు వైష్ణవాలయ మేగి
కాంమ్ము గడుపు సాధ్వీలలామ

ఎట్టి యిక్కట్టు లొదవినన్ బట్టినట్టి
నోము వీడని కడుగడు నీ మగత్తె
ధర్మజన చక్షు రుత్సవదాయి, భాయి
పుత్తలీబాయి — విఖ్యాతి పొందెనోయి.

ఆ మానినీ రత్నంబు కరమ చందు గాంధి నాల్గవ భార్య. ఈ పుణ్య దంపతులకొక పుత్రికయును, మువ్వురు పుత్రులును జనించిరి. వారిలో కడగొట్టు కొమరుడే భరతమాత దాస్య శృంఖలముల విడగొట్టు మహాత్మునిగా ప్రభవించిన మోహనదాసు కరమచందు గాంధి. అతను పుట్టినదాదిగా తనదు పుణ్యమె దాదిగా శుక్లపక్ష సుధాకరుని చందంబున దినదిన ప్రవర్థ మానుడగుచుండెను. మాతృ శిక్షణలో నతడు మహదాశయ సంచయమ్మును సంతరించుకొనెను.

ద్విపద

చిరుత ప్రాయమునందె శ్రీశుని భక్తి
గరపెను యాయమ్మ కరము బిడ్డలకు
ధార్మిక చింత సదాచార నిరతి
యుగు పాలనుబట్టి యుద్బోధ జేసె
సాధు సంఘసేవన సత్యమహింస
బోధించి సద్గుణ మూర్తుల జేసి
ఆచార నియమమ్ము లనవరతమ్ము
పాటింతురా వీల పసిపిల్లలైన

వీరలిట్లుండగా —

పద్యం

పాకీ పనులను జేయుచు
లోకుల సేవించు కులములోన జనించెన్
ఊకా యన్నియెడు బాలుం
డాకుట్టడు గాంధి యింటి కనయము వచ్చున్.

ఒకనాడు యూకాను జూచి బాల మహాత్మ డిట్లనియె:

[సశేషం]

## గొట్ట బ్యారేజి పథకం

**పై వరుసలో :**

ఎడంవైపు- ఏప్రిల్ 16వ తేదీన గొట్ట బ్యారేజికి ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.

కుడివైపు- ప్రజల ఆనందోత్సాహాలు

**మధ్య వరుసలో :**

ఎడంవైపు- శంకుస్థాపనోత్సవానికి వేలాది ప్రజలు హాజరైనారు.

కుడివైపు- ఉత్సవానికి వచ్చిన ప్రజలతో ముఖ్యమంత్రి సంభాషణ.

**క్రింది వరుస :**

ఎడంవైపు- ఒక ముసలి అవ్వ ముఖ్యమంత్రికి నమస్కరిస్తున్న దృశ్యం.

మధ్యలో- పొలంలో ఒక గిరిజన స్త్రీ.

కుడివైపు- శంకుస్థాపనోత్సవం చూడవచ్చిన ఒక గిరిజన వనిత.

## చిత్రాల సమీక్ష

( ఫోటోలు : శ్రీధర్ ఆంధ్రప్రదేశ్ ప్రెస్ ఫోటో సర్వీసు )









# మహాభారతము

తిరుపెగంటుల లక్ష్మణశాస్త్రి

## వాతాపి ఇల్వలుల కథ

"రాజా! పూర్వము 'మణిమతీ' పురమునందు 'ఇల్వలుడు' అను రాక్షసుడు ఉండెను. అతనికి 'వాతాపి' యను తమ్ముడుండెను. ఇల్వలుడొక తపశ్శాలియగు బ్రాహ్మణునితో, 'తనకు ఇంద్రసమానుడగు పుత్రుని ప్రసాదింపు' మని కోరెను. ఆ బ్రాహ్మణుడు అందుకు అంగీకరించలేదు. దానికి ఇల్వలునకు మిక్కిలి కోపము వచ్చి కనపడిన బ్రాహ్మణుల నందరను హత్య చేయుచు వచ్చెను ఆ హత్యావిధాన మెట్లనగా, ఇల్వలుడు తన తమ్ముని ఒక మేకగా చేయుచుండెను. ఆ మేకను వండి, అతిథిగా వచ్చిన బ్రాహ్మణునకు ఆహారముగా పెట్టుచుండెను. చచ్చి యమ లోకమునకు పోయిన ప్రాణిని బ్రతికించి తిరిగి తనకు రప్పించు శక్తి యిల్వలునకు ఉండెను. కనుక నతడు, బ్రాహ్మణుని ఉదరములో మేక మాంస రూపములోనున్న వాతాపిని 'వాతాపీ! రమ్ము' అని పిలుచుచుండెను. తోడనే వాతాపి బ్రతికి బ్రాహ్మణుని ఉదరము చీల్చి బయటకు నవ్వుచు వచ్చుచుండెను. ఈ విధముగా ఇల్వలుడు బ్రాహ్మణులను చంపుచుండెను.

## అగస్త్యుని వివాహము

"ఇట్లుండగా నొకనాడు అగస్త్య మహాముని యా మార్గముగా పోవుచు ఒక గుంటలో తలక్రిందుగా వ్రేలాడుచున్న తన పితరులను చూచెను. వారు అట్లు ఎందులకు ఉన్నారని అగస్త్యుడు వారి నడిగెను వారు, 'నాయనా! మేము నీ పితృదేవులము మన వంశములో నిన్ను విడిచి యితర సంతతిలేదు గనుక మేము దుర్గతికి పోవుచున్నాము. నీవు సత్పుత్రుని గనినచో మాకును నీకును సద్గతి కలుగగలదు.' అని చెప్పిరి. ఆ మాటకు అగస్త్యుడంగీకరించి సంతానార్థము ప్రయత్నము చేయదొడగెను. తన సంతతిని గర్భములో ధరించగల స్త్రీ అతని కెక్కడను కానరాలేదు. అప్పుడు అగస్త్యుడు ఒక్కొక్క జంతువు యొక్క ఉత్తమోత్తమమైన ఒక్కొక్క అవయవమును తన సంకల్ప బలముచేత సంపాదించి ఆ యవయవములతో నొక ఉత్తమ స్త్రీని నిర్మించెను. అప్పుడు పుత్రార్థియై తపస్సు చేయుచున్న విదర్భ రాజు పత్ని గర్భములో అగస్త్యుడు తాను నిర్మించిన స్త్రీ యంశమును విడిచెను. అప్పుడు ఆ రాజపత్ని గర్భమునుండి ఆ స్త్ర్యంశముచేత కన్యక పుట్టెను. ఆ బిడ్డ మెఱుపువలె మెఱయుచు రాజ కులమునంతయు శోభిల్ల జేసెను. ఆ బిడ్డకు 'లోపాముద్ర' అని యా రాజు పేరు పెట్టెను. ఆ కన్యక ఉత్తమ రూప సౌందర్య శోభితయై జలములో కమలినీలతవలె, యజ్ఞ కుండములో అగ్ని శిఖవలె అతి శీఘ్రముగా పెరిగెను. ఆమె కన్యా శతములోను, దాసీ సహస్రములోను పెరుగుచు నక్షత్రములలో రోహిణివలె విరాజిల్లుచు నవ యౌవన శోభితురాలయ్యెను యౌవనస్థురాలైనను ఆ కన్యకను, అగస్త్యుని వలన భయముచేత ఎవరును వరించజాలకుండిరి. ఆ కన్యక, తన రూప సౌశీల్యాది గుణ సంపదచేత తండ్రిని బంధుజనమును సంతోషపరచుచుండెను ఆమెను ఎవనికిచ్చి వివాహము చేయవలెనని తండ్రి చింతించుచుండెను.

"అగస్త్యుడు గృహస్థాశ్రమమునకు ఆమె శక్తురాలైనదని తలచి తనకొరకు ఆమెను ఇమ్మని విదర్భరాజును కోరెను. ఆ రాజు భయపడి యేమియు బదులు చెప్పజాలక భార్యతో విచారించెను. భార్యాభర్త లిరువురు భయపడుచు దుఃఖించుచుండగా లోపాముద్రవచ్చి, 'తండ్రీ నాకై మీరు బాధపడవలసిన అవసరములేదు. మీరు ఆత్మరక్షణకొరకు నన్ను అగస్త్యునకు ఇచ్చివేయుడు. లేకున్నచో నతడు శాపాగ్నిచే మిమ్ము దగ్ధులను చేయును' అని చెప్పగనే తండ్రి ఆమెను అగస్త్యునకిచ్చి శాస్త్రోక్తముగా వివాహము చేసెను.

"తరువాత అగస్త్యుడామెతో, 'నీ యమూల్య వస్త్రాభరణాదులను విడిచి ముని జనోచితములగు నారచీరలను ధరించి నా వెంట రమ్ము', అనగనే ఆమె ఆవిధముగానే చేసెను. పతితో సమానమగు వ్రత చర్యను ఆశ్రమించెను. తరువాత ఆ ముని భార్యతో హరిద్వారమునకు పోయి తపస్సును కారంభించెను. లోపాముద్ర పతికి అనుకూలురాలై పరిచర్యలు చేయుచుండెను. అగస్త్యునకు ఆమె యెడ ప్రీతి కలిగెను. ఇట్లు చాల కాలము గడవగా నొకనాడు. తపః ప్రభావముచేత శోభిల్లుచు శుచిస్నాతయై యున్న లోపాముద్రను అగస్త్యుడుచూచి, ఆమెచేయు పరిచర్యచేతను, ఆమెయొక్క శరీర కాంతి, రూప-శౌచ-దమముల

చేతను మిక్కిలి సంప్రీతుడై ఆమెతో కలియవలెనను నిచ్ఛతో నామెను ఆహ్వానించెను.

"అప్పుడు లోపాముద్ర సిగ్గుపడుచు ప్రాంజలియై పతితో ప్రణయ పూర్వకముగా 'మహర్షీ ! నీవు సంతానార్థివై నన్ను పెండ్లి చేసికొంటివి. నీ కోరికను నెరవేర్చుటయే నా కర్తవ్యము కాని, మా తండ్రి యొక్క రాజభవనములో నున్న శయ్యము వంటి శయనమునందే, అట్టిమేడలోనే నేను నీతో సంగమము చేయుటకు ఇషపడుచున్నాను. నీవు మంచి సుగంధి మాల్యములను, అమూల్య వస్త్రాలంకారములను ధరించి యుండగా, నేను గూడ నట్లే అలంకరించుకొని నీతో సంగమము చేసెదను. అట్లుకాకుండ, ఈ నార చీరలు, చర్మములు, కాషాయవస్త్రములు ధరించి మనము సంగమము చేసినచో, ఈ పవిత్ర వస్తువులు అపవిత్రములగును, అది నాకు ఇష్టముకాదు' అనెను ఆ మాటకు. అగస్త్యుడు, 'నా వద్ద ధనములేదు అవి యెక్కడనుండి నాకు లభించును. నీ తండ్రి వలె నేను రాజును కానుగదా' అనెను. అప్పుడామె మహర్షీ ! నీవు సమర్థుడవు ఈ ప్రపంచములోని వస్తువులన్నియు నీ తపో మహిమచే నొక క్షణములో సంకల్ప మాత్రమున సంపాదించగలవు.' అనెను. ఆ మాటకు అగస్త్యుడు, 'కల్యాణీ ! అట్లయినచో నా తపస్సు వ్యయము చెందును దానికి నేను ఇష్టపడను. నా తపోవ్యయము కాకుండ నీవు కోరినవన్నియు లభించునట్లు ఏదైన ఉపాయము చెప్పుము.' అనెను. ఆ మాటకు లోపాముద్ర 'తపోధనా ! నా ఋతుకాలము కొంచెము మాత్రమే మిగిలియున్నది. ఈ వేషభూషలతో నేను నిన్ను కలియుటకు ఇష్టపడను. నీ తపోలోపమునకుగూడ ఇష్టపడను. కనుక నీ ధర్మమునకు భంగము వాటిల్లకుండ నా యిచ్ఛా పూర్తియగు నట్లు ఈ స్వల్పకాలములో నీవే యోచించి నిర్ణయించుకొనుము ' అని యనెను. ఆ మాటకు అగస్త్యుడు, 'కాంతా ! అట్లయినచో నేను ధనసంపాదనకై పోయెదను. నీవిచటనే యిచ్ఛానుసారముగా ధర్మాచరణము చేయుచుండుము,' అని చెప్పి బయలుదేరెను.

"అగస్త్యుడు ధనమును అర్థించుటకు అధిక ధనవంతుడని ప్రసిద్ధి నందిన 'శ్రుతర్వుడు' అనురాజు కడకుపోయెను. అతడు ఆ మునిని అర్ఘ్యాదులతో పూజించి 'వచ్చిన కార్యమేమి?' యని యడిగెను. ఆ మాటకు అగస్త్యుడు, 'రాజా! నేను ధనార్థినై నీ వద్దకు వచ్చితిని ఇతర ప్రాణులకు కష్టము కలిగించకుండ మిగులు ధనమును నీవు యథాశక్తి నాకు దానము చేయుము.' అని యడిగెను. ఆ మాటకు శ్రుతర్వుడు అగస్త్యునకు తన ఆయ-వ్యయముల పట్టికను చూపి. 'యిందులో నీవు తీసికొనదగిన ధనమేదైననున్నచో తీసికొనుము ' అని చెప్పెను. అది చూచి అగస్త్యుడు 'దీనిలో ఆయము-వ్యయము సమానముగ నున్నవి. ఇందులో ఏ కొంచమైనను ధనము నేను తీసికొనినచో ఇతర ప్రాణులకు కష్టము కలుగు'నని తలచి శ్రుతర్వరాజుతోపాటు 'బ్రధ్నశ్వుడు' అను రాజు వద్దకుపోయెను. అతని ఆయ-వ్యయములుగూడ నిట్లేయుండుటను చూచి యా ముగ్గురును కలిసి ధనార్థులై 'పురుకుత్స' పుత్రుడగు 'త్రసదస్యు' మహారాజు కడకు పోగా నచటగూడ ఇట్టిపరిస్థితియేయేర్పడెను. అప్పుడా ముగ్గురు రాజులు అగస్త్యునితో 'మహాత్మా ! నిలువ ధనము అధికముగా 'ఇల్వలుడు' అనురాక్షసుని వద్దనున్నది. మన మందరము పోయి యా దానవుని యాచింతము ' అని అందరును కూడబలికికొని ఇల్వలుని వద్దకు ధనమాదనకై పోయిరి.

## వాతాపివధ

"ఇల్వలుడు ఆ మహర్షిని, రాజులను పూజించి, పూర్వము వలెనే తన తమ్ముని వాతాపిని మేకగా చేసి వండి వారికి వడించుటకు సిద్ధముగా నుండెను. అప్పుడా రాజులు దుఃఖమును పొందిరి అగస్త్యుడు వారిని ఓదార్చి, 'మీరు చింతచేయకుడు. వీనిని నేనే జీర్ణము చేసెదను ' అని చెప్పి వండిన పదార్థమంతయు అగస్త్యుడొక్కడే భుజించెను. ఇల్వలుడు 'వాతాపీ! లేచిరమ్ము' అని పిలుచుచుండగనే, 'వాతాపీ ! జీర్ణించిపొమ్ము' అని అగస్త్యుడు అనెను. దానితో వాతాపి జీర్ణించి, నశించెను దానికి ఇల్వలుడు దుఃఖపడి ప్రాంజలియై వారితో, 'మీరు ఏకారణముచేత ఇచటికి వచ్చితిరి.' అని యడిగెను దానికి వారు వచ్చిన సంగతిని అతనికి తెలిపిరి. అప్పుడు ఇల్వలుడు అగస్త్యునితో. 'నా మనస్సులో మీకు ఏమి ఈయ దలచుచున్నానో మీరు చెప్పగలిగినచో నేను ఇచ్చెదను అది చెప్పుడు ' అని యనెను. దానికి అగస్త్యుడు, 'మహాసురా ! నీవు ఈ రాజులలో నొక్కొక్కరికి పదివేల గోవులు, పదివేల బంగారు నాణెములు ఇవ్వదలచినావు. నాకు దానికన్న ద్విగుణము ఇచ్చి యదిగాక, మనోవేగముల రెండు గుఱ్ఱములు కట్టబడిన సువర్ణ రథమును గూడ ఇవ్వదలచినావు.' అని చెప్పెను. అగస్త్యుని మాటవిని ఇల్వలుడు, 'మహర్షీ ! నీవు చెప్పినదంతయు సత్యమేకాని, నేనీయదలచిన రథము మాత్రము సువర్ణమయ మైనదికాదు ' అని యనెను. ఆ మాటకు అగస్త్యుడు, 'అసురపతీ! నా మాట యెప్పుడు గూడ పొల్లుపోలేదు. ఆ రథము నిక్కముగా బంగారుదే అవసరమున్నచో తెలిసికొనుము ' అనెను. అప్పుడు దానిని తెలిసికొని యిల్వలుడు మనస్సులో బాధపడి అగస్త్యునకు అధిక ధనమునిచ్చెను. ఆ బంగారు రథమునకు 'విరావ-సురావ' నామములు గల రెండు గుఱ్ఱములను కట్టియిచ్చెను. ఆ రథములో వారు ధనమును నింపి వారు గూడ ఎక్కి యిల్వలుని వీడ్కొని బయలుదేరిరి. అగస్త్యుని చంపుటకు ఇల్వలుడు వెన్నంటిరాగా అతనిని ఆ ముని ఒక్క హుంకారముతో భస్మము చేసి తన యాశ్రమమునకు పోయెను. ఆ ముగ్గురు రాజులు అగస్త్యుని యాజ్ఞ తీసికొని స్వనగరములకు పోయిరి.

"అప్పుడు అగస్త్యుడు లోపాముద్ర యిష్టార్థమును తీర్చి ఆమెను సంతోషపరచెను. అప్పుడామె, 'భగవాన్ ! ఇప్పుడు నా యందు అత్యంత శక్తిమంతుడగు నొక పుత్రుని కనుడు." అని చెప్పెను. ఆ మాటవిని యతడు 'కల్యాణీ ! నీ ప్రవర్తన చేత నేను సంతుష్టుడ నయితిని. నీ గర్భములో పదిమంది కొడుకుల బలముగల వేయిమందిని గాని, నూరు మందిని గాని కొడుకులను కందునా లేక, శత పుత్రులతో సమానబలముగల పదుగురను కందునా ? లేక దశపుత్రులతో సమాన బలశాలియగు నొక్క పుత్రుని కందునా ? నీకు ఏదియిష్టమో తెలుపుము.' అని యడిగెను.

ఆ మహాకాయ ఆమె, 'తపోధనా! వేయిమంది పుత్రుల బలముగల ఒక పుత్రునే నాకు ప్రసాదింపుము. అసాధువులగు అనేకులకన్న సాధువై విద్వాంసుడగు పుత్రుడొక్కడే చాలును.' అని యనెను. అగస్త్యుడామె కోరిక ప్రకారమే యగుగాక యని చెప్పి శ్రద్ధాయుక్తుడై, శ్రద్ధాయుక్తురాలైన లోపాముద్రతో ఋతుసమయము నందు సంగమము చేసి ఆమెకు గర్భధారణ చేసెను.

"ఆ తరువాత లోపాముద్రలో ఆ గర్భము ఏడు సంవత్సరములు పెరిగెను ఏడవయేట గర్భోత్పత్తియై మహాతేజశ్శాలియగు పుత్రుడు పుట్టెను. అతనికి 'దృఢస్యు' అని పేరు పెట్టబడెను అతడు సాంగవేదపారంగుడై మహాతేజస్వియై వెలసెను. అతడు బాలకుడుగా నున్నప్పుడే తన తండ్రి యింటికి కట్టెలమోపులు మోసికొని తెచ్చుచుండుటచేత అతనికి 'ఇధ్మవాహ' నామమేర్పడెను. అతనిని చూచి అగస్త్యుడు సంతసించెను ఆ పుత్రుని చేత అగస్త్యుని పితరులకు పుణ్యలోక ప్రాప్తికలిగెను అప్పటి నుండి యీ స్థానము 'అగస్త్యాశ్రమ' నామముచే ప్రసిద్ధిచెందెను ప్రహ్లాద వంశము వాడగు వాతాపి అగస్త్యునిచే ఈ విధముగా నష్టమయ్యెను. ఆ వాతాపి యొక్క రమణీయమైన ఆశ్రమమే యిది.

"ధర్మరాజా! ఇచటనే గంగానది ప్రవహించుచున్నది. ఇది దక్షిణ దిక్కునంతటిని పవిత్రము చేయుచున్నది. ఈ నది యందు నీవు యథేచ్ఛగా స్నానము చేయుము. యుధిష్ఠిరా! ఇది భృగుతీర్థము. ఇందులో పూర్వము పరశురాముడు స్నానముచేసి తాను పోగొట్టుకొనిన తేజస్సును తిరిగి పొందెను. నీవు గూడ, ధర్మరాజా! ఈ భృగుతీర్థములో సపరివారుడవై స్నానము చేసినచో, దశరథరామునిచే నపహృతమైన తేజస్సును పరశురాముడు ఇందులో స్నానముచేసి తిరిగి పొందినట్లే, దుర్యోధనాదులు అపహరించిన నీ తేజస్సును, రాజ్యమును తిరిగి నీవు పొందెదవు."
అని చెప్పెను. లోమశునిమాట ప్రకారమే యుధిష్ఠిరుడు భృగుతీర్థములో స్నానముచేసిన తోడనే యుధిష్ఠిరుని శరీర తేజస్సు శత్రువులకు ఆక్రమింపబడజాలనిదిగా నయ్యెను. అప్పుడు ధర్మరాజు లోమశమహామునితో, 'మహాత్మా! పరశురాముని తేజస్సు ఎందు కొరకు అపహరింపబడెను? దానిని తిరిగి అతడు ఎట్లు సంపాదింపగలిగెను? ఆ కథ నవిస్తరముగా మాకు మీరు దయచేసి చెప్పుడు.' అని యడుగగా లోమశుడిట్లు చెప్పదొడగెను:

## పరశురామ గర్వభంగము

"శ్రీ మహావిష్ణువు దుష్టరావణ వధార్థమై దశరథ పుత్రుడుగా నరుడుగా నవతరించెను. అతనిని అయోధ్యలో మేము గూడ అప్పుడప్పుడు దర్శించుచుంటిమి. ఋచీకుని యొక్క భృగువు యొక్క వంశములో రేణుకా-జమదగ్నులకుసుతుడుగా పరశురాముడు అవతరించి యుండెను. అతడు దశరథరాముని పరాక్రమమును గూర్చి విని అతనిని చూచుటకు ధనుర్ధారియై శ్రీరాముని పరాక్రమమెట్టిదో పోటీపడి కనిపెట్టదలచి అయోధ్యకు పోయెను. దశరథుడు పరశురామ మహర్షి అయోధ్యకు వచ్చిన సంగతివిని అతనికి స్వాగతమిచ్చి తోడ్కొనివచ్చుటకు శ్రీరాముని పంపెను. అతడు చేతిలో ధనుర్బాణములను తీసికొని పరశురాముని కడకు పోయెను.

అతనిని చూచి పరశురాముడు నవ్వుచు. 'రాజకుమారా! నీకు శక్తి యుండినచో ఈ నా ధనుస్సుపై అల్లెత్రాడు ఎక్కుపెట్టుము. ఇది సామాన్యధనువు కాదు. దీనితో నేను సప్త క్షత్రియ సంహారము చేసితిని.' అని చెప్పెను ఆ మాటలు విని శ్రీరామచంద్రుడు పరశురామునితో, 'భగవన్! నీవు ఈ విధముగా నన్ను అధిక్షేపించదగదు. నేనుగూడ క్షత్రియ ధర్మపాలకులలో అధముడను కాను. మా ఇక్ష్వాకు వంశజులు తమ బాహుబలమును ప్రశంసించుకొనరు ' అని యనెను. ఆ మాటకు పరశురాముడు, 'అధికముగా మాటలాడి నీ వంశమును పొగడుకొనుటలో ప్రయోజనము లేదు. ఇదుగో నా యీ ధనువును తీసికొని నారి సారించుము.' అని ధనువును అందీయగా దానిని శ్రీరాముడు తీసికొని దానిపై క్షణములో అవలీలగా అల్లెత్రాటిని సంధించి సశబ్దమగు ధనుష్టంకారము చేసెను. పిడుగువంటి ఆ ధ్వని చేత సర్వభూతములు కంపించి భయపడెను. అప్పుడు శ్రీరాముడు పరశురామునితో, 'ధనుస్సు ఎక్కుపెట్టితిని గదా! ఇంకేమి చేయవలెనో చెప్పుము.' అని యనగనే పరశురాముడు 'దీనియందు ఈ నా దివ్య బాణమును సంధించి ఆకర్ణాంతము లాగుము ' అని చెప్పి తన చేతిలోని బాణమును శ్రీరామునకిచ్చెను

"ఆ మాట విని శ్రీరామచంద్రుడు క్రోధముచేత మండిపడుచు. 'భృగునందనా. నీవు చాల గర్వివి. నీ మాటలను వినుచు గూడ నిన్ను క్షమించుచున్నాను నీవు నీ పితామహుడగు ఋచీకుని ప్రభావముచేత నతిశయించిన తేజస్సుగలవాడై క్షత్రియులను, జయించితివి అందులో సందేహములేదు. దానిచేత నీవు బల పరాక్రమ శాలివని తలచి నన్నధిక్షేపించుచున్నావు. నీకు దివ్యచక్షువును ప్రసాదించితిని. నీవు నా స్వరూపమును చూడుము.' అని యతనికి దివ్యచక్షుస్సునిచ్చెను. అప్పుడు పరశురామునకు శ్రీరాముని శరీరములో స్థావర జంగమాత్మకమైన చతుర్దశ భువనములు, మూర్తిమంతములగు సమస్త వేద శాస్త్రములుండుట కనపడెను. ఆ తరువాత శ్రీరామచంద్రుడు ఆ బాణమును విడిచెను. దానితో లోకములో పిడుగులు, తోకచుక్కలు, దుమ్ము మొదలగు వానితో మహావర్షము కురిసెను భూమి కంపించెను. ఆ బాణము పరశురాముని వ్యాకులపరచి యతని తేజస్సును మాత్రము లాగికొని తిరిగి శ్రీరాముని కడకు వచ్చిచేరెను. దానితో పరశురాముడు మూర్ఛిల్లి తిరిగి తెలివి తెచ్చుకొని, చచ్చిబ్రతికిన వానివలె నుండి శ్రీరామునకు నమస్కరించి అతని యాజ్ఞగొని తిరిగి తన మహేంద్ర పర్వతమునకు పోయి తపస్సు చేయుటకు ఆరంభించెను. అట్లు ఒక సంవత్సరము గడచిన తరువాత అతని పితృదేవతలు. అతడు తేజోహీనుడై, అభిమాన శూన్యుడై యుండుటను చూచి అతనితోనిట్లనిరి :—

"నాయనా! నీవు భగవంతుడైన విష్ణువునకు అపచారము చేసి యీ దుర్గతికి పాల్పడితివి అతడు త్రిలోక పూజ్యుడని, యెరుగక చేసితివి. కనుక నీవిప్పుడు వెంటనే 'వధూసర' అను పేరుగల పుణ్యనదీ తీరమునకు పొమ్ము. ఆ తీర్థమునందు స్నానము చేసినచో నీకు తిరిగి పూర్వ రూపము వచ్చును. 'దీప్తోదము' అనిపేరుగల ఆ తీర్థములో పూర్వము నీ పితామహు

దగు భృగువు తపస్సు చేసెను." యుధిష్ఠిరా ! పితృదేవతలు చెప్పినమాటలు విని పరశురాముడు ఆ విధముగానే యీ తీర్థములో స్నానముచేసి పూర్వ తేజస్సును పొందెను.' అని లోమశుడు యుధిష్ఠిరునకు పరశురాముని వృత్తాంతము చెప్పెను. యుధిష్ఠిరుడు లోమశునితో 'మహాత్మా ! ఇంకను అగస్త్య మహర్షియొక్క అద్భుత కర్మలను వినవలెనని యిష్టము కలదు. దయచేసి చెప్పుడు.' అని యడుగగా లోమశుడిట్లు అగస్త్యుని అద్భుత కర్మలు చెప్పదొడగెను :—

## వృత్రాసుర వధ

"రాజా ! పూర్వము కృత యుగములో 'కాలకేయులు' అను రాక్షసులుండిరి. వారు యుద్ధ తంత్ర కోవిదులై ఘోరముగా యుద్ధము చేయుచుండిరి. వారొకప్పుడు వృత్రాసురుని శరణుజొచ్చి అతని బలమును ఆశ్రయముగా గొని ఇంద్రాది దేవతలపై నాలు దిక్కుల నుండి దాడి సలిపిరి అప్పుడు దేవతలు వృత్ర వధకై ప్రయత్నములు సలుపుచు వచ్చిరి ఇంద్రుని ముందిడుకొని దేవతలు బ్రహ్మకడకు పోయిరి బ్రహ్మదేవుడు వారు వచ్చిన కార్యమును తెలిసికొని వృత్రవధోపాయము నిట్లు చెప్పెను :—

"'దధీచుడు' అను మహర్షి కలడు. అతని కడకు మీరందరు పోయి యొక వరమును వేడుడు. అతడు వెంటనే మీకు వరము నిచ్చును. అప్పుడు మీరందరు కూడి ఒక్కమాటగా ఆయనతో, త్రైలోక్యహితము కొరకు ఆయన యెముకలిమ్మని కోరుడు. అప్పుడాయన సంకోచించక తన శరీరమును వీడి అస్థులను మీకు ఇవ్వగలడు. ఆ యస్థులతో 'వజ్రము' అను నొక యాయుధమును సిద్ధము చేయవచ్చును. అది ఆరుఅంచులుగల ఆయుధమగును. అది అతిఘోరమైన శత్రు వధమును చేయునదిగా నుండును. ఆ వజ్రాయుధము చేత తప్పక యింద్రుడు వృత్రాసురుని వధించగలడు. వెంటనే మీరు దధీచుని కడకు పొండు", అని బ్రహ్మ చెప్పెను.

## వజ్రాయుధ నిర్మాణము

"తరువాత దేవతలు బ్రహ్మను వీడ్కొని శ్రీమన్నారాయణుని ముందిడుకొని దధీచియాశ్రమమునకు పోయిరి అది సరస్వతీ నదికి ఆవలి యొడ్డున అనేక మృగ సంకీర్ణమగు వనములో నుండెను. అచట సూర్యప్రభతో వెలుగుచున్న దధీచి మహామునిని దర్శించి అతని పాదములకు నమస్కరించి వరము వేడిరి. ఆ ముని సంతుష్టుడై వారు కోరిన వరమే దెనను, చివరకు తన దేహమైనను ఇచ్చెదనని చెప్పెను. అప్పుడు దేవతలు లోకహితార్థమై ఆ తాపసుని అస్థులను కోరగా అతడు వెంటనే అంగీకరించి తన ప్రాణములు వీడెను. దేవతలతని యస్థులను తీసికొని బ్రహ్మకడకు పోయిరి. అతడు సంతుష్టుడై ఆ యెముకలతో వజ్రాయుధమును నిర్మించి వారికిచ్చి, 'దీనితో మీరు శత్రువులను భస్మము చేయగలరు. పొండు' అని చెప్పెను దానిని ఇంద్రుడు తీసికొనెను.

"పిదప ఇంద్రుడు దేవసేనతో వృత్రాసురునిపై దాడి సలిపెను. ఆ యసురుడు భూమ్యాకాశములను ఆవరించి యుండెను. అతనిని రక్షించుచు కాలకేయాదులు ఆయుధ ధారులై యుండిరి. లోక భయంకరమగు యుద్ధము దేవదానవులకు ప్రారంభమయ్యెను. ఒండొరుల ఖడ్గములు ఒండొరుల శరీరములకు తాకుచు చూర్ణము లగుచుండెను. ఆకాశమునుండి శిరస్సులు, తొడిమవీడి క్రింద పడుచున్న తాటి ఫలమువలె తెగిపడుచుండెను కాలకేయదానవులు స్వర్ణకవచములను ధరించి దావాగ్నితో గూడిన పర్వతము వలె దేవతలపై బడుచుండిరి. వారి వేగమునకు తట్టుకొనలేక దేవతలు భంగపడి పరుగెత్తుచుండిరి, వారిని చూచి యింద్రుడు ఏమియు తోచక కశ్మలపడి శ్రీమన్నారాయణుని శరణువేడెను. అప్పుడా దేవుడు ఇంద్రుని బలమును పెంచదలచి తన తేజస్సును అతనిలో నుంచెను. విష్ణుభగవానునిచేత సురక్షితుడుగా చేయబడిన యింద్రుని చూచి దేవతలు తమ తేజస్సునుగూడ అతనిలో నుంచిరి. బ్రహ్మర్షులుగూడ తమతమ తేజస్సును ఇంద్రునకు ప్రసాదించిరి. ఆ యందరి తేజస్సులచేత ఇంద్రుడు పరిపూర్ణుడయ్యెను.

"అప్పుడు ఇంద్రుడు అధిక బలశాలియయ్యెనని తెలిసికొని వృత్రాసురుడు గొప్పగా సింహనాదమును చేసెను. ఆ ధ్వనితో భూమ్యాకాశములు దిక్కులు పర్వతములు గడగడ వడకెను. ఇంద్రుడు కూడ ఆ ధ్వనికి మిక్కిలి భయపడి త్వరగా వజ్రాయుధమును వృత్రాసురునిపై ప్రయోగించెను. ఆ దెబ్బతో బంగారు మాల్యమును ధరించిన ఆయసురుడు, పూర్వము విష్ణువు చేతినివీడి పడిన మందర పర్వతమువలె నేలగూలెను. అప్పుడు ఇంద్రుడు, తాను వజ్రాయుధము విడుచుటపైనను, వృత్రాసురుడు హతుడగుటపైనను విశ్వాసములేక భయముతో ఆ సమీపముననున్న సరస్సులో దూరి దాగుకొనబోయెను. అప్పుడు ఇతర దేవతలందరు మిగిలిన రాక్షసులను ఆయుధములతో కొట్టిరి. దేవతలకు భయపడి రాక్షసులందరు సముద్రములో దూరి దాగిరి. అచట వారందరు త్రైలోక్యనాశము చేయుటకొరకు దురాలోచనలు చేసిరి. వారిలో కొందరు మతిమంతులు తమకుతోచిన ఉపాయములను చెప్పిరి. చాలకాలము విచారించుచుండిన ఆ దుష్ట దానవులకొక ఘోరమగు నుపాయము తోచెను. వారు తొలుత విద్వాంసులను తపస్వులను ధ్వంసము చేయవలెను. ఎందుకనగా, సమస్త లోకములు తపస్సుచేతనే నిలిచి యున్నవి కదా ! కనుక తపోభంగమునకై అందరమున్ను ప్రయత్నించవలెను. భూలోకములోనున్న ధర్మాత్ములను, మునులను త్వరగా చంపవలెను. వారు నశించినచో ప్రపంచమే నశించును గదా!"అని యీ విధముగా ఆ రాక్షసులందరు జగత్తును నశింపజేయుటకు నిశ్చయించుకొని, సముద్రమును దుర్గముగా చేసికొని అందులో దాగియుండిరి,

(సశేషము)

# నెల్లూరు జిల్లాలో కొత్త పరిశ్రమలకు అవకాశాలు

## ఖనిజ ప్రాతిపదిక పరిశ్రమలు

### సోడియం సిలికేట్

శ్రేష్ఠమైన సిలికా యిసుక, ఒక రకం దినుసు శిల యీ జిల్లాలో కొల్లలుగా లభిస్తుంది. కోస్తా ప్రాంతంలో మేలురకం సిలికా యిసుకా, మైకాగనుల సమీపంలో ఫెల్స్‌ఫర్‌తో కూడిన ఒకరకం దినుసు శిల లభిస్తాయి ఒకరకం దినుసు శిల, సిలికా యిసుకలతో సోడియంసిలికేటు తయారుచేయవచ్చు నెల్లూరు, చిత్తూరు, కడప, గుంటూరు పరిసర జిల్లాలలో సోడియం సిలికేట్ తయారుచేసే యూనిట్లులేవు. సబ్బులు, జిగురు, బోర్డుల తయారీ, ప్లయివుడ్, జవుళీ కొలత మొదలైనవాటి తయారీలో సోడియం సిలికేట్‌ను విరివిగా ఉపయోగిస్తారు. బట్టలసబ్బు తయారీకి చెందిన లఘు పరిశ్రమలలో వినియోగానికి యీ జిల్లాలో సోడియం సిలికేట్ యూనిటును నెలకొల్పవచ్చు.

### క్యాల్షియం కార్బొనేట్

పులికట్ట ప్రాంతంలో లభించే పగడపు శిలలు, శంఖులతో క్యాల్షియం కార్బోనేటు తయారుచేస్తారు. నెల్లూరు జిల్లాలో గానీ పరిసరజిల్లాలోగానీ క్యాల్షియం కార్బొనేటు తయారుచేసే యూనిట్లు లేవు. పెయింట్లు డిస్టెంపర్లు, పౌడర్లు, టూత్‌పేస్ట్, లిప్‌స్టిక్, ఆయింట్‌మెంట్స్, సైజింగ్, రబ్బరు, ప్లాస్టిక్ పిల్లర్లు. ప్రేలుడు పదార్థాలు మొదలైన వాటిలో క్యాల్షియం కార్బొనేటును ఉపయోగిస్తారు. ముద్రణకు ఉపయోగించే సిరా, బిస్కెట్లు, కోళ్ల ఆహారం, క్యాల్షియం గ్లుకోనేటు తయారీలో కూడా దీనిని ఉపయోగిస్తారు. ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ పరిశ్రమలలో వార్షికంగా 200 టన్నుల కాల్షియం కార్బొనేటును ఉపయోగిస్తున్నారు. రసాయనిక పరిశ్రమల సంఖ్య పెరుగుతున్నదృష్ట్యా క్యాల్షియం కార్బొనేటు డిమాండు కూడా పెరుగుతున్నది.

### సిరమిక్ ట్రిమర్, అభ్రకం కండెన్సర్లు

నెల్లూరు జిల్లాలో అభ్రకం, గాజు పదార్థాలు పుష్కలంగా లభిస్తాయి. దళసరి అభ్రకం రేకులతో సిరమిక్ ట్రిమర్, కండెన్సర్లను తయారుచేస్తారు. జిల్లాలో లభించే ముడిపదార్థాలతో వాటిని తయారుచేయవచ్చు. రేడియోలు. ఆంప్లిఫయర్లు, ఎలక్ట్రానిక్ పరికరాలలో అభ్రకం కండెన్సర్లను విరివిగా ఉపయోగిస్తారు.

ఆంధ్రప్రదేశ్‌లోను దేశంలోను ఆటోమేషన్ పెరుగుతున్నదృష్ట్యాను ఎలక్ట్రానిక్ పరిశ్రమ త్వరితగతిని అభివృద్ధిచెందుతున్న దృష్ట్యాను యీ జిల్లాలో సిరమిక్, అభ్రకం కండెన్సర్ల తయారీ యూనిట్లను ఏర్పాటుచేయడానికి మంచి అవకాశాలు ఉన్నాయి.

### జీడిమామిడి గుల్లలు--నూనెలు

జిల్లాలో 1966_67లో 1,88 847 కిలోగ్రాముల జీడి మామిడి ఉత్పత్తి అయింది. జీడిమామిడిని శుభ్రం చేయడం జరుగుతున్నప్పటికీ వ్యవస్థాపూర్వకంగా యిందుకై ఎటువంటి యూనిట్లు లేవు. జీడిమామిడిని శుభ్రంచేసే పని ఆకర్షణీయమైన పరిశ్రమ. భారత దేశంలోనూ, విదేశాలలోనూ జీడిమామిడికి మంచి గిరాకీ ఉంది.

జీడిమామిడి గుల్లనుండి నూనె తీయడం అనుబంధ పరిశ్రమగా ఉన్నప్పటికీ గుల్లలను కాల్చడం ద్వారా వృధాచేస్తున్నారు. పడవలు చేపవలలు, తేలికరకం కలప వస్తువులకు వాటర్ ప్రూఫింగ్ చేయడం, టైపురైటర్ రోలర్స్, ఆయిల్, ఆసిడ్ ప్రూఫిసిమెంటు ఇండస్ట్రియల్ ఫ్లోరింగ్ టైల్స్, బ్రెక్‌లైనింగ్, కేబుల్‌క్లాత్‌లకు ఇన్సులేటింగ్ పదార్థాలు యీటారు స్టాపింగ్స్, పిగ్మెంట్స్, పేయింట్స్, జాయింట్ ఫిల్లర్స్, క్యాస్టింగ్స్, కోల్డ్‌సోల్డర్స్ పాటింగ్ కంపౌండ్ వంటి ఎలక్ట్రికల్, ఎలక్ట్రానిక్ పరిశ్రమల లోను దానిని ఉపయోగించవచ్చు.

చీడిమామిడి గుల్లనూనె చాలా ముఖ్యమైన ముడిపదార్థం. ముఖ్యంగా అమెరికాకు ఎగుమతిచేయడానికి మంచి అవకాశాలు ఉన్నాయి. జిల్లాలో యీ పరిశ్రమను ప్రారంభించడానికి మంచి అవకాశాలు ఉన్నాయి.

### ప్లాస్టర్ ఆఫ్ పారిస్

నెల్లూరు జిల్లా పులికట్ సరస్సు ప్రాంతంలో దాదాపు 10 లక్షల టన్నుల మేలిరకం జిప్సమ్ (హరశోరం) లభిస్తుంది. క్యాల్షియంసల్ఫేటుకు సెమీ హైడ్రేట్ అయిన ప్లాస్టర్ ఆఫ్ పారిస్ పింగాణిపరిశ్రమలోను (కుమ్మరిపని, పింగాణి శానిటరీ వస్తువులు, ఎలక్ట్రికల్ ఇన్సులేటర్లు మొదలైనవి) సర్జికల్ డ్రెసింగ్స్, ప్లాస్టిక్

బోరులు, ప్లాస్టర్ విగ్రహాలు మొదలైన వాటిని జిల్లాలో లభించే జిప్సమ్‌తో తయారుచేయవచ్చు. ఆంధ్రప్రదేశ్‌లో ప్లాస్టర్ ఆఫ్ పారిస్ తయారుచేసే యూనిట్లు లేవు. రాష్ట్రంలో రూ. 2,00,000 విలువచేసే వస్తువులు అవసరమైనందున జిల్లాలో యీ పరిశ్రమ యూనిటును నెలకొల్పడానికి మంచి అవకాశాలు ఉన్నాయి.

## "టేబిల్ సాల్ట్"

నెల్లూరు జిల్లాలో 120 మైళ్ల సముద్రతీర ప్రాంతం ఉంది. వివిధ కోస్తా ప్రదేశాలలో ఉప్పు ఉత్పత్తి చేస్తున్నారు. మామూలు ఉప్పులో తేమ గుణం ఉన్నందున దబ్బాల నుండి అది సులభంగా రాలదు. డ్రైయర్స్‌తో శుద్ధి చేయబడిన ఉప్పు సులభంగా రాలుతుంది. చూడడానికి అందంగా ఉండి ఉపయోగానికి వీలుగా ఉంటుంది. భావనగర్‌లోని కేంద్ర సముద్రవస్తువులు, ఉప్పు పరిశోధన కేంద్రం తయారుచేసిన ప్రాతిపదికపై సులభంగారాలే ఖాద్యపు ఉప్పును తయారుచేయడానికి మంచి అవకాశాలు ఉన్నాయి. తాడలో ఉప్పుతయారీ యూనిట్లు ఉన్నందున యీ పరిశ్రమకు యిది అనువైన ప్రదేశం. ఈ వస్తువు ఉత్పత్తికి రాష్ట్రంలో యూనిట్లు లేవు. మద్రాసు, విజయవాడలకు సమీపంలో ఉన్న కారణంగాను, మంచి వనరులు ఉన్నకారణంగాను యీ జిల్లాలో యిటువంటి పరిశ్రమను స్థాపించడానికి మంచి అవకాశాలు ఉన్నాయి.

## ఆముదంనుండి కృత్రిమసుగంధ ద్రవ్యాల తయారీ

ఈ జిల్లాలో దాదాపు 50,000 ఎకరాలలో ఆముదపు పంట వేయబడుతున్నది. గులాబీ, మల్లె, లిల్లీ వంటి స్వతస్సిద్ధమైన పూలనూనెలకు బదులుగా ఆముదపు నూనె నుండే సువాసన నూనెలను తయారు చేయవచ్చు. పూల నుండి లభించే సుగంధ ద్రవ్యాలు చాలా ఖరీదైనవి. అందువల్ల పరిశ్రమలలో వాటిని వాడలేరు. ఆంధ్రప్రదేశ్‌లో యీ రకం పరిశ్రమలు లేని దృష్ట్యానూ, తల నూనెలు తయారు చేసే యూనిట్లు అధికంగా ఉన్న దృష్ట్యా ఈ జిల్లాలో యిటువంటి పరిశ్రమను నెలకొల్పడానికి మంచి అవకాశాలు ఉన్నాయి.

## శుద్ధి చేసిన ఆముదపు నూనె:

నెల్లూరు జిల్లా పశ్చిమ తాలూకాలాలలో ముఖ్యమైన పంటలలో ఆముదం ఒకటి. ఔషధాలు, పారిశ్రామిక రంగాలలో శుద్ధి చేసిన ఆముదం నూనెను అనేక రకాలుగా ఉపయోగిస్తారు. ఆంధ్రప్రదేశ్‌లోను, రాష్ట్రం వెలుపలా ఔషధ పరంగా ఆముదం నూనెకు మంచి గిరాకీ ఉంది. ప్రస్తుతం ఆముదాన్ని శుద్ధి చేయడానికి హైదరాబాదులో ఒక యూనిటు మాత్రమే ఉంది. నెల్లూరు జిల్లాలో యిటువంటి ఒక యూనిటును నెలకొల్పవచ్చు.

## డీ హైడ్రేటెడ్ ఆముదపు నూనె

ఈ జిల్లాలో 50,000 ఎకరాలలో ఆముదం పంట వేయబడుతున్నది. ఆముదం నుండే తయారుచేసే డి హైడ్రేటెడ్ ఆముదం నూనెను పెయింట్లు, ప్రింటింగ్ సిరా, లినోలియంలలో ఉపయోగిస్తారు. ఉపరితలం కోటింగులో డ్రయింగ్ నూనెగా ప్రధానంగా ఉపయోగిస్తారు. పెయింట్లు పరిశ్రమల నుండే దీనికి మంచి డిమాండు ఉంది. అఖిల భారత స్థాయిలో యీ ఉత్పత్తికి వార్షికంగా 300 టన్నుల డిమాండు ఉంది.

# ఆహార పదార్థాల తయారీ

## రాగి మాల్ట్

నెల్లూరు జిల్లాలో 1966-67సం॥ 76000 ఎకరాలలో రాగిపంట వేయబడింది. (చిన్న తరహా కాయ ధాన్యం). 40,000 టన్నుల రాగి ఉత్పత్తి అయింది. రాగుల నుండి రాగిమాల్ట్ తయారుచేయవచ్చు. పట్టణాలలోని గృహాలలోను, రెస్టారెంటులలోను యిటువంటి ఆహార పదార్థాలకు మంచి డిమాండు ఉంటుంది. ముఖ్యంగా మంగళగిరి, ఉదయగిరి ప్రాంతాలలో రాగులు బాగా లభించే దృష్ట్యా వాటిలో యేదో ఒక ప్రాంతములో పరిశ్రమను ఏర్పాటు చేయవచ్చు.

## మిరపనుండి ఒలియోరెసిన్ తయారీ

నెల్లూరు జిల్లాలో 1966-67 సం॥లో 26,000 ఎకరాలలో మిర్చిపంట వేశారు. "ఒలియోరెసిన్" ఉన్నందువల్లనే మిర్చిలో రుచి, కారము ఉంటున్నది. మిర్చి నుండి యీ రెసిన్‌ను వేరు చేసి ఆహార పదార్థాల తయారీ పరిశ్రమలో ఉపయోగించవచ్చు. రెసిన్‌ను వెలికి తీయడానికి మైసూరులోని కేంద్ర సాంకేతిక పరిశోధనా మండలిలో ప్రత్యేక విధానాన్ని రూపొందించారు.

## ప్రత్తి గింజలు విడ తీసే పరిశ్రమ

జిల్లాలో 11,000 ఎకరాలకు పైగా ప్రత్తి పంట వేస్తారు. రాకపోకల సౌకర్యాలు బాగా ఉన్న సింగరాయ కొండలో ముఖ్యంగా ప్రత్తి గింజలు తీసే పరిశ్రమ యూనిటును, నెల్లూరులో నూలు మిల్లును నెలకొల్పవచ్చు.

# డిమాండు ప్రాతిపదిక పరిశ్రమలు

## విద్యుచ్ఛక్తి మోటార్లు పంపుసెట్లు

జిల్లాలో వార్షికంగా 360 పంపు సెట్ల వాడకం దృష్ట్యాను, వార్షికంగా డిమాండుతో 20 శాతం పెరుగుదల ఏర్పడే దృష్ట్యాను జిల్లాలో యీ పరిశ్రమ యూనిటును నెలకొల్పడానికి మంచి అవకాశాలు ఉన్నాయి. ప్రస్తుతం పని చేస్తున్న ఫౌండ్రీలలో కేవలం జాబ్‌వర్కుపై ఆధారపడేకన్నా పంపుసెట్ల ఉత్పత్తి పనిని చేపట్టవచ్చు. గ్రామీణ విద్యుదీకరణ పెరుగుతున్న దృష్ట్యాను, వ్యవసాయ పనులపై ఆధారపడుతూ నీటిపారుదలకు లిఫ్టు ఇరిగేషన్‌పై ఆధారపడుతున్న దృష్ట్యానూ, 3, 5, హెచ్. పి. ల శక్తి గల

విద్యుచ్ఛక్తి మోటార్లను తయారుచేసే యూనిటును యిక్కడ నెలకొల్పడానికి అవకాశాలు ఉన్నాయి.

## పొగాకు బ్యారెనుల ఆవములు

నాగార్జునాసాగర్ నీరు లభ్యమవుతున్న దృష్ట్యా గుంటూరులో పొగాకు సేద్యం తగ్గిపోవచ్చు అందువల్ల నెల్లూరు జిల్లాలో యీ పంట సేద్యానికి ప్రోత్సాహం లభిస్తుంది. పంట మార్పిడి పద్ధతిలో యిప్పటికిప్పుడే పేర్కొన తగిన మార్పు వచ్చింది వర్జీనియా పొగాకును శుద్ధి చేయడానికి బ్యారెన్ ఆవములు, పైపులు అవసరమౌతాయి. ప్రతి 20 ఎకరాల వర్జీనియా పొగాకు పంట విస్తీర్ణానికి ఒక బ్యారెన్ ఆవము అవసరమవుతుంది. ఈ ప్రాంతంలో 250 నుండి 300 వరకు బ్యారెన్ ఆవములు అవసరమవుతాయి. ఈ పరిశ్రమను నెలకొల్పడానికి మంచి అవకాశాలు ఉన్నాయి. ఇందులోని ఫౌండ్రీ యూనిటు పరిసర ప్రాంతాలలోని బియ్యం, నూనె మిల్లుల అవసరాలను, యితర జాబ్ వర్కులను కూడా తీర్చవచ్చు.

## స్ప్రేయర్లు డస్టర్లు

నెల్లూరు జిల్లాలో వ్యవసాయ కార్యక్రమాలు చాలా ముఖ్యమైనవి. వ్యవసాయరంగంలో అనేక పథకాల అమలు వల్ల యింకా అభివృద్ధి సాధించడానికి అపారమైన అవకాశాలు ఉన్నాయి. ఆంధ్ర కోస్తా ప్రాంతములో ఎక్కడా వ్యవసాయ పరికరాల తయారీ యూనిట్లు లేవు ఈ జిల్లాలోను, పరిసర ప్రాంతాలలోను వార్షికంగా రు 2,50,000 ల విలువగల స్ప్రేయర్లు డస్టర్ల డిమాండు ఉంది. ఈ దృష్ట్యా జిల్లాలో యీ పరికరాల తయారీకి ఒక యూనిటును నెలకొల్పడానికి మంచి అవకాశాలు ఉన్నాయి.

## బనియనులు, అండర్‌వేర్లు మొదలైనవి

ముఖ్యంగా పట్టణ ప్రాంతాలలో బనియనులు, అండర్‌వేర్ల వంటి వస్తువుల వినియోగం బాగా పెరుగుతున్నది. నెల్లూరు జిల్లాలోగానీ, పరిసర జిల్లాలలోగానీ వాటి తయారీకి సంబంధించిన యూనిట్లులేవు 1967లో జిల్లా రు. 1,75,000/-ల విలువగల యిటువంటి వస్తువుల డిమాండు ఉందని అంచనా పట్టణ జనాభా పెరుగుదల, జీవన స్థాయి పెరుగుదల, ప్రజల అలవాట్లలో మార్పుల ఫలితంగా వీటికి డిమాండు వార్షికంగా 15 శాతం పెరిగే అవకాశంఉంది. జిల్లాలో యీ వస్తువులకు డిమాండు బాగా ఉన్న దృష్ట్యా నెల్లూరులో వాటి తయారీకి ఒక యూనిటును నెలకొల్పడానికి అవకాశాలు ఉన్నాయి.

## చేపలుపట్టే-నూలు, నైలాన్ వలలు

నెల్లూరు జిల్లాలో 120 మైళ్ళ కోస్తా ప్రాంతం ఉంది కోస్తా గ్రామాలలో చేపలు పట్టే వృత్తి ప్రధానమైన వృత్తులలో ఒకటి. సముద్రంలోను, లోతట్టులోని నీటిలోను చేపలు పట్టడానికి వలలు కావల్సి ఉంటాయి. జిల్లాలోగానీ, పరిసర ప్రాంతాలలోగానీ చేపల వలలు తయారుచేసే యూనిట్లులేవు. ఆంధ్ర ప్రదేశ్‌లో వార్షికంగా రు. 6.00 లక్షలు విలువచేసే చేపల వలలకు డిమాండు ఉంది ఆంధ్రప్రదేశ్‌లో కోస్తాజిల్లాలలోని ఆర్థిక వ్యవస్థలో చేపల షికారీకి ప్రాముఖ్యం ఉన్న దృష్ట్యాను, మద్రాసుకు సమీపంలో ఉన్న దృష్ట్యాను, జిల్లాలో చేపల వలల తయారీకి యూనిటును నెలకొల్పడానికి మంచి అవకాశాలు ఉన్నాయి.

## కార్బోనిక్ గ్యాస్

ఈ జిల్లాలో సంవత్సరంలో దాదాపు 9 నెలలు వేడిగాను, తేమగాను ఉండడంవల్ల గార్బొనేటెడ్ పానీయాలకు మంచి గిరాకీ ఉంటుంది. జిల్లాలో నెలకు 7000 సిలెండర్ల కార్బొనేటెడ్ గ్యాస్ అవసరమవుతుందని అంచనా.

## అజోడైస్

నెల్లూరు జిల్లాలో దాదాపు 60,000 నేత మగ్గాలు ఉన్నాయి. అధిక మొత్తంలోఅద్దకం రంగులను యిక్కడ ఉపయోగిస్తారు. జిల్లాలో అద్దకం రంగులకు మంచి డిమాండు ఉంది. 1967 లో రు. 6,00,000 లు విలువ చేసే అద్దకం రంగులను వినియోగించారని అంచనా నెల్లూరు జిల్లాలోగానీ, పరిసర జిల్లాలలోగానీ అద్దకం రంగులు తయారు చేసే యూనిట్లు లేవు. అందువల్ల నెల్లూరు జిల్లాలో అజోడైస్ తయారీ యూనిటును నెలకొల్పడాన్ని ప్రోత్సహించవచ్చు.

# ఏదీ వసంతం?

కె. శివారెడ్డి

నిజంగా వసంతం వచ్చిందా ?
లోకం సంతలోకి నవనీతం తెచ్చిందా ?
గుండె గున్నమావి తోటలో
గండు కోయిలదండు విడిది చేసిందా !

అయితే, ఈ
రోడ్డమ్మట, గోడపక్క
అరటిమొక్క మొవ్వ గొంతులో
మంచు మంచినీటిచుక్క దిగలేదుగదా ?

అటు, అటు పక్క గుడివద్ద
గుడిసె కనుగూట్లో, గుడ్డిదీపం గుండెలో
వెలుగు పడగెత్తే వత్తికొసన్నా లేదే !

ఆ దొడ్లో, ఆ చెట్టు మొదట
చీమలు, పాపం చలిచీమలు
బలవంతం చేస్తున్న, భోంచేస్తున్న
సీతాకోక చిలుకకు
కొత్తరెక్కల రెమ్మలు మొలవలేదు కదా ?
ఆకుల చెక్కిళ్ళ మీద
ఆనంద బాష్పాంకురాలేవి ?
తలిరాకుల మేనిపై
నీహార చందన గంధమేది ?
విచ్చని పూవుల సంగతలా ఉంచు
వయసొచ్చిన పూవుల ఎదదమావుల్లో
ఎగిరే కోరికల చేప చిక్కేదెలా ?

వికసించిన కుసుమాల యౌవనం
ఉసుళ్ళలా ఎగిరి రెక్కలు రాలాక
తొండలకు బలయి పోతోంది.

పార్కు పడక గదిలోనే
ఇనుప బెంచి పందిరి మంచంమీద
ఆకలి, దౌర్భాగ్యం
ఆక్రంద నా వేదనలతో
జీవితాన్ని కొలుస్తున్న
నిస్పృహ దహించే జీవి
నా నెచ్చెలి—
అతని పొట్ట పెరటితోటలో
నిజంగా వసంతం హసించిందా ?
నిరుటి గాయాలపై
పరిమళాల పూత పూసిందా ?
కందెన లేని బళ్ళు
కాడి గలవని ఎడ్లు
వంతెన లేని ఏళ్ళు
చినుకు నోచుకోని బీళ్ళ నోళ్ళు
రెక్కలు విరచబడ్డ పావురాళ్ళు
ఆకారం లేని రాళ్ళు
వేకువ లేని రాత్రుళ్ళు
ఎన్ని ? మరెన్ని కన్నీళ్ళు
ఆ కన్నీళ్ళు గూడా నోచుకోని
నయనాల లోగిళు
ఎన్నేళ్ళ నుంచో రెప్పల అలలు
తాకుతున్న కనుగ్రుడ్ల బంత్రాళ్ళ —
వీటన్నిటి వదన వనాంతరాల్లో
ఒక్క చదరపు అంగుళం మేరన్నా
పచ్చబడలేదు, పచ్చిక మొలవలేదు
ఇంకెక్కడ వసంతమోయ్ ?
చెట్లు, చేమలు చేవ బట్టటం గాదు
లతలు, తీగలు పళ్ళికిలించటం గాదు
వసంత మంటే—
కలెక్టరు గారమ్మాయి కడుపార నవ్వితే
వసంతం వాకిట్లోకి వచ్చినట్లు కాదోయ్
కార్మికుని కష్టంతో నేల తడసిన చోట
వేల వేల గులాబీలు పూయాలోయ్ వసంతమంటే—
తాసీల్దారు గారి చిన్నోడు పుట్టిన్రోజు చేసుకుంటే
కాలం సురభిళించి నట్లు గాదెన్నటికీ—
తహతహ లాడే జీవి గొంతులో
క్రాంతి సంగీతం ఒలికి, సర్వత్రా చల్లబడి
పచ్చదనం పరచుకున్న నాడే వసంతం—
లేదు వసంతం
రాదు వసంతం
ఏ ఒక్క గుండెన్నా
ఆకలి ఎంగిలాకులు తిన్నన్నాళ్ళు
అసంతృప్తి పేలికలు చుట్టినన్నాళ్ళు
అశాంతి చలిలో గడ్డ కట్టినన్నాళ్ళు
లేదు వసంతం లేదు

# చైతన్యమూర్తులు

## శ్రీ జి. ఎ. నరసింహారావు

శ్రీ గైనేడి అప్పల నరసింహారావు 1912 ఫిబ్రవరి 13 వ తేదీన జన్మించారు. అసిస్టెంటు ఇంజనీర్లుగా అభ్యర్థులను నేరుగా ఎన్నిక చేయడంకోసం మద్రాసు సర్వీసు కమీషను నిర్వహించిన పోటీ పరీక్షలో శ్రీ నరసింహారావు ప్రథమస్థానం పొందారు. 1936వ సంవత్సరంలో మద్రాసు ప్రభుత్వ సర్వీసులో అసిస్టెంట్ ఇంజనీరుగా చేరారు. ఈ హోదాతో ఆయన కాకినాడలో జిల్లా హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రి భవనాల నిర్మాణానికీ, మద్రాసు నగరంలో విమానదాడులనుంచి రక్షణ పొందటానికి చేపట్టిన కట్టడాల నిర్మాణానికీ; అంతేగాక గోదావరి డెల్టాలో సేద్యపు నీటి పారుదలకు.



డ్రైనేజికి సంబంధించిన పనులకూ బాధ్యత వహించారు. 1942–1953 సంవత్సరాల మధ్య ఆయన పబ్లిక్ వర్క్స్ శాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా వున్నారు. అప్పుడు ఆయన గోదావరి డెల్టా పశ్చిమ డివిజనులో సేద్యపు నీటి పారుదలకు, డ్రైనేజికి సంబంధించిన పనులకు ఇన్‌ఛార్జిగా వున్నారు. మద్రాసు సమీపంలో రెడ్ హిల్స్ ఫ్లయింగ్ బోట్ బేస్ నిర్మాణమూ, చోలవరం విమానాశ్రయ నిర్మాణమూ ఆయన పర్యవేక్షణ క్రిందనే జరిగాయి. 1955–66 సంవత్సరాల మధ్య శ్రీ నరసింహారావు నాగార్జునసాగర్ కాలువల ప్రాజెక్టుకు ఛీఫ్ ఇంజనీరు అయ్యారు. 1963 వరకు ఈ పదవీ బాధ్యతలను ప్రతిభావంతంగా నిర్వహించారు. 1963 డిశెంబరులో ప్రభుత్వ అదనపు కార్యదర్శి పదవీ బాధ్యతలు స్వీకరించారు. బహూళార్థ సాధక నదీలోయ ప్రాజెక్టులైన నాగార్జున సాగర్ ప్రాజెక్టు, శ్రీశైలం జల విద్యుత్ ప్రాజెక్టులతోసహా రాష్ట్రంలోని అన్ని నీటి పారుదల ప్రాజెక్టులకూ ఈ హోదాలో ఆయన ఇన్‌ఛార్జిగా వున్నారు.

రాష్ట్రంలో అమలు జరిగిన సేద్యపు నీటి పారుదల కార్యక్రమాలతో శ్రీ నరసింహారావుకు దీర్ఘకాల సంబంధంవుంది. ఆయన పబ్లిక్ వర్క్స్ శాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా వున్నప్పుడు 1952 సెప్టెంబరులో వరదల మూలంగా దాదాపు పది లక్షల ఎకరాలకు నీటి పారుదల చేస్తున్న కృష్ణా ఆనకట్టకు గండిపడ్డది. ప్రతిభావంతమైన ఆయన సారథ్యం క్రింద, అద్భుతమైన, సాహసోపేతమైన పనితనంతో రెండు వారాలలోగానే ఈ గండిని పూడ్చడం జరిగింది. తత్ఫలితంగా పది లక్షల ఎకరాలలో పైర్లు వేయడానికి సాధ్యమైంది. తరువాత నీటి మట్టం తగ్గిపోయినప్పుడు ఈ ఆనకట్టను పునర్నిర్మించారు. విజయవాడలో కృష్ణా బ్యారేజి నిర్మాణంకూడా ఆయన అధ్వర్యం క్రిందనే జరిగింది. మూడు పని ఋతువుల స్వల్ప వ్యవధిలో, రూ. 2.7 కోట్ల తక్కువ ఖర్చుతో దీని నిర్మాణాన్ని పూర్తి చేశారు. 1956–1963 సంవత్సరాల మధ్య శ్రీ నరసింహా రావు రూ. 100 కోట్ల నాగార్జున సాగర్ కాలువల ప్రాజెక్టు యొక్క పర్యాప్త డిజైను అమలుకు సంబంధించిన వ్యవహారాలకు ఇన్‌ఛార్జిగా వున్నారు.

అనేక సందర్భాలలో ఆయన విదేశాలకు పంపించబడినారు.

1946–47లో నీటి పరఫరా డ్రైనేజి విషయాలలో ఉన్నత శిక్షణ పొందే నిమిత్తం ఆయనను ఇంగ్లాండు, యూరపు, అమెరికాలకు పంపించారు. 1969 లో ఆస్ట్రేలియాలో నీటి పారుదల, డ్రైనేజి విషయాలపై జరిగిన అంతర్జాతీయ మహాసభలో శ్రీ నరసింహా రావు భారత దేశానికి ప్రాతినిధ్యం వహించారు. 1963 లో అదే హోదాలో ఆయన జపాను సందర్శించారు. 1967 ఆగస్టులో యు. ఎస్. ఎస్. ఆర్. లెనిన్‌గ్రాడ్‌లో యునెస్కో మొదలైన అంతర్జాతీయ సంస్థల సహకారంతో నిర్వహించిన అంతర్జాతీయ గోష్ఠిలో భారత దేశం తరఫున ఏకైక ప్రతినిధిగా పాల్గొన్నారు. కేంద్ర జల విద్యుత్ సంఘం అధ్యక్షునిగా నియమించబడడానికిగాను 1968 జూన్ మొదటి తేదీనుండి ఆయన ఉద్యోగ సేవలు భారత ప్రభుత్వం పరం చేయబడినవి. 1970 జనవరి 26వ తేదీన రిపబ్లిక్ దినోత్సవాల సందర్భంగా వీరికి పద్మభూషణ బిరుద ప్రదానం చేయబడింది.

## శ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మ

కూచిపూడి నాట్యంలో నిష్ణాతుడు శ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మ. భామాకలాపంలో సత్యభామగానూ, ఉషా పరిణయంలో ఉషగానూ, ప్రహ్లాదలో లీలావతిగానూ, కుశలవలో సీతగాను ఆయన అభినయించారు. ఈ స్త్రీ పాత్రలను అభినయించడంలో ఆయన చాలా ప్రసిద్ధి గాంచారు.

శ్రీ సత్య నారాయణశర్మ 1934 లో కృష్ణా జిల్లా కూచిపూడిలో జన్మించారు. ప్రఖ్యాత కూచిపూడి నాట్యాచార్యులు స్వర్గీయ చింతా కృష్ణమూర్తిగారి వద్ద ఆయన నాట్యం అభ్యసించారు. తమ గురువు గారి నాట్య బృందమైన "వెంకట్రామ నాట్య మండలి"లో ప్రముఖ సభ్యుడుగా ఆయన దేశమంతటా పర్యటించి నాట్య ప్రదర్శనలిచ్చారు. కూచిపూడి నాట్యం పునరుద్ధరణకు శ్రీ సత్యనారాయణ శర్మ ప్రధానకారకుడనడంలో అతిశయోక్తి లేదు.



ఆయన తన కళాకౌశల్యానికి పేరు ప్రఖ్యాతులు ఆర్జించడమేకాకుండా కూచిపూడి నాట్యానికికూడా పేరుప్రఖ్యాతులను సంపాదించి పెట్టారు.

తమ 27వ యేట శ్రీ సత్యనారాయణశర్మ రాష్ట్రపతి అవార్డు పొందారు. దీనిని కేంద్ర సంగీత, నాటక అకాడమీ సమర్పించింది

కూచిపూడి నాట్యంలో పురుషుడు స్త్రీ పాత్రను ధరించడమే కాకుండా, నాట్యం చేస్తున్న సమయంలో స్వయంగా పాట పాడవలసి వుంటుంది. వీటిని సునాయాసంగా సాధించడంలో ఆయన సిద్ధహస్తులు. సాత్వికాభినయంలో ఆయనది అందె వేసిన చెయ్యి

శ్రీ శర్మ యిప్పుడు కూచిపూడిలోని శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రానికి ప్రిన్సిపాలుగా వున్నారు కూచిపూడి నాట్యంలో శిక్షణ యివ్వడానికి స్థాపించిన అద్వితీయమైన సంస్థ యిది.

ఈ యేడు జనవరిలో వీరికి పద్మశ్రీ బిరుదు ప్రదానం జరిగింది.

## బసవేశ్వరుడు

వేదాలలోనూ, ఉపనిషత్తులలోనూ చాలా సందర్భాలలో శివ ప్రసక్తి వస్తుంది. బ్రహ్మ సృష్టికర్త అనీ, విష్ణువు సంరక్షకుడనీ, శివుడు సంహార కర్త అనీ సాధారణంగా అనుకొంటాం. శివుడంటే మంగళకరుడని అర్థం. శివుడంటే కేవలం లయకారుడు కాడనీ పరమాత్మయే అని గ్రహించాలి.

సత్యం జ్ఞాన మనంత శ్చ చిదానంద ఉదాహృతః
నిర్గుణో నిరుపాధి శ్చ నిరంజ నోవ్యయస్తథా
యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ
తదేవ ప్రథమం ప్రోక్తం బ్రహ్మైవ శివ సంజ్ఞితమ్

సత్యం, జ్ఞానం, అనంతం, చిదానందం, నిర్గుణం, నిరుపాధి, నిరంజనం, వినాశరహితం అనదే శివతత్త్వం. మనసునకూ వాణికీ అతీతమైన బ్రహ్మమే శివ శబ్ద వాచ్యం.

శివారాధనం అనాదిగా వస్తూంది. శివుణ్ణి, లింగరూపంలో అర్చిస్తారు. 'లింగం' అంటే 'చిహ్నం' అని అర్థం. లయనా ల్లింగ ముచ్యతే. దీనిలో సమస్తమూ లయమై పోతుంది కనుక ఇది లింగం అనబడుతుంది

శైవం అనాదిగా ఏదో ఒక రూపంలో దర్శనం ఇస్తూనే ఉంది. పండ్రెండవ శతాబ్దారంభంలో శైవానికి ప్రాబల్యం తగ్గింది. శైవాన్ని వీరశైవంగా పునరుద్ధరించిన వాడు బసవేశ్వరుడు.

సమస్త లోక సంచారి అయిన నారదుడు ఒకసారి కైలాసానికి వెళ్లాడు. "భూలోకంలో శివభక్తి క్షీణిస్తూ ఉన్నట్లు తెలిసింది నిజమేనా?" అని అడిగింది పార్వతి. "నిజమే" నని విన్నవించుకున్నాడు మహర్షి. మర్త్యలోకంలో శివతత్త్వ ప్రచారం చేయడానికి నందికేశ్వరుణ్ణి ఆదేశించాడు పరమ శివుడు.



కర్ణాట దేశంలో (ఇప్పటి బిజాపూర్ జిల్లాలో) భాగవాటి అనే గ్రామంలో మాదిరాజు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన భార్య మాదాంబ. వారికి సంతానం లేదు. మాదాంబ నందికేశ్వరుణ్ణి పూజించి

నందీశ నందీశ నమనందినాథ
నీ యట్టి సద్భక్తు నీ యట్టి పుత్రు
ఖ్యాతిగా నొక్కని కరుణించితేని
ప్రీతి యెలర్ప నీపే రిడుదాన.

అని ప్రార్థించింది.

భూలోకంలో పుట్టడానికి రానేవచ్చాడు నందికేశ్వరుడు. తనవంటి పుత్రుణ్ణే ఇవ్వడమేమిటి మాదాంబకు తానే పుత్రునిగా

బసవయ్యగా జన్మించాడు నందికేశ్వరుడు. శివుని వాహనమైన వృషభం నంది. వృషభ శబ్ద వికారమే బసవ శబ్దం.

జాతి గోత్రాలకు అతీతమైనవాడు శైవుడు యజ్ఞోపవీతం బ్రాహ్మణజాతికి చిహ్నం. బ్రాహ్మణ్యం వేరు. భక్తి వేరు. ద్విజుల కుద్దేశింపబడింది గాయత్రి. సర్వమానవులకూ ఉపాస్యమైనది షడక్షరీ మంత్రం యజ్ఞోపవీతాన్ని, బ్రాహ్మణ ధర్మాన్ని విసర్జించాడు బసవేశ్వరుడు.

బసవయ్య మేనమామ బలదేవుడు. ఆయన కల్యాణపుర ప్రభువు బిజ్జలుని దండనాయకుడు. శివభక్తుడైన మేనల్లునికి తన పుత్రిక గంగాంబను ఇచ్చి వివాహం చేశాడు బలదేవుడు. బలదేవుని మరణానంతరం బసవేశ్వరుడే దండనాయకు డయ్యాడు.

బసవేశ్వరుని మహత్తును తెలియజేసే గాథలు ఎన్నో ఉన్నాయి. అటువంటి గాథలు కల్పిత కథలని అనుకొనేవారు కూడా ఒక్క విషయం గ్రహించాలి— మహనీయుల గుణాలకు ఉదాహరణ ప్రాయంగానే ఆ గాథలు వెలిశాయని.

ఒకనాడు బసవేశ్వరుడు జంగమార్చనం చేస్తున్నాడు. లింగధారులు కానివారు ఆయన యింట ప్రవేశించడానికి వీలు లేదు. కొందరు దొంగలు వంకాయలను లింగాలుగా ధరించి చొరబడ్డారు. బసవన్న ఆహ్వానంపై దొంగలు లింగార్చనం చేయవలసి వచ్చింది. వంకాయలు లింగకాయలుగా మారాయి. దొంగలు పశ్చాత్తాపపడ్డారు శివభక్తు లయ్యారు.

బసవేశ్వరుని దానగుణానికి దృష్టాంతంగా ఒక కథ ఉంది. అడిగిన వారికి అడిగినంత ఇచ్చే స్వభావం బసవన్నది. జంగయ్యలకు కోశాగారంలోని ధన మంత ధారపోస్తున్నాడని బసవనాథుని మీద ఫిర్యాదు వెళ్ళింది. "రాజధనం పరధనం కదా, పరధనం అపహరించడం దోషంకాదా?" అని అడిగాడు బిజ్జలుడు. "పరమేశ్వరుడనే పారిజాతం నాకు ఉండగా పరుల ద్రవ్యం అపేక్షింపవలసిన దౌర్భాగ్యం నా కేమి పట్టింది!" అన్నాడు బసవయ్య. భాండాగారం పరీక్షింపగా ఉండవలసిన దానికంటే ఎక్కువగానే కనబడింది ధనం.

కథలమాట ఎలాఉన్నా బసవేశ్వరుడు చేసిన ఘనకార్యం వీరశైవోద్ధరణం—మత సంస్కరణం, జీవుడు అంగం. శివుడు లింగం జీవుడనే అంగం విశ్రాంతి పొందేది శివుడనే లింగంలోనే. లింగం అంగానికి మూలాధారం. ప్రపంచోత్పత్తికి మూలకారణం గురువు ప్రసాదించే లింగం. ఇష్టలింగం ఇష్టవాగోపాసన వీరశైవులకు ముఖ్యవిధి.

"నమః శివాయ" పంచాక్షరీ మంత్రం పృథివ్యాది పంచభూతాలూ, బ్రహ్మాది పంచ అధిదేవతలూ. విద్యాది పంచతత్త్వాలూ ఈ పంచాక్షరిలో ప్రతిష్ఠమై ఉన్నాయి. ఓంకార సహితమైన ఈ మహామంత్రాన్ని గురువు ద్వారా ఉపదేశం పొంది లింగాంగ సామరస్యం సాధించడమే వీరశైవుల ధర్మం.

సామాన్యజనులకు అర్థమయ్యే సులభ సుందరమైన వ్యావహారిక కన్నడంలో వచనాలు వ్రాసి బసవన్న శివధర్మ ప్రచారం చేశాడు అర్థంలేని ఆచారాలను తెగనాడి జాతివ్యవస్థను తెగటార్చి వర్ణాంతర వివాహములను ప్రోత్సహించి, అస్పృశ్యతను అణగార్చి పుణ్యహాతుల దుశ్చర్యము దుయ్యబట్టి మహిళలను మాననీయలనుగా గుర్తింపజేసి సాంఘిక న్యాయస్థాపనకు కృషి చేసి, సర్వజనులకూ సర్వేశ్వరభక్తిని ఉపదేశించిన మహాసంస్కర్త మానవతావాది బసవేశ్వరుడు.

## లోకమాన్య తిలక్

ఆనాడు బొంబాయిలో అనేకమహాపండితులు సమావేశమైన మహాసభ. బాల గంగాధరతిలక్ వార్ధియా నాగరికతను గురించి మహోపన్యాసం చేసి భారత ఇరాన్ నాగరికతలలోని సాదృశ్యాలను సమీక్షించాడు సభ ముగిసిన తరవాత సభాధ్యక్షుడు తిలక్‌తో ఇలా అన్నాడు "తిలక్‌గారూ, మీరు మీ సామర్థ్యాన్ని సద్వినియోగం చేసుకోవడం లేదు మీ బుద్ధిశక్తి దేదీప్యమానమైనది చారిత్రిక పరిశోధనకు మీరు పూనుకొంటె మీకు విశ్వవ్యాప్తమైన విఖ్యాతి లభిస్తుంది. మీరు ఈ రాజకీయ జంబాలంలో ఎందుకు దిగబడుతున్నారు." దానికి తిలక్ జవాబు "భారత దేశం గొడ్డు పోలేదు.



స్వరాజ్యం వస్తే నావంటి విద్వాంసులు వేలకొద్ది ఉండగలరు. మనం ప్రతి ఒక్కరమూ దేశసేవకు సిద్ధపడవలసిన మహత్తర అవసరం ఏర్పడింది ఈనాడు. మనసామర్థ్యాన్ని, మనశక్తిని, మన సర్వస్వాన్ని స్వరాజ్య సంపాదన కోసం సమర్పింప వలసి ఉంది.

ఆయన న్యాయశాస్త్రంలో ఉత్తీర్ణుడైన పట్టభద్రుడు. అర్జనమే ఆదర్శంగా పెట్టుకొని ఉంటే ఆనాటి న్యాయవాదులలో అగ్రగణ్యుడై లక్షలకు అధికారి అయ్యేవాడు. కాని ఆ వృత్తిని తృణప్రాయంగా తిరస్కరించాడు. భాగ్యలక్ష్మిని ఆరాధించడానికి ఆయన

నిరాకరించాడు. ఆయన తలచుకొంటే సాహిత్య సామ్రాట్టు అని అనిపించుకొనేవాడు. కాని ఆయనకు సరస్వతీ సాన్నిధ్యం సమ్మతం కాలేదు. పారతంత్ర్యంలో పరితపిస్తున్న భారతమాత సేవయే ఆయనకు ఆవశ్యకమనిపించింది. అయినా పరిశోధన రంగంలోనూ సాహిత్య రంగంలోనూ ఆయన సాధన సాధారణమైనది మాత్రం కాదు.

దేశానికి మొట్టమొదలు చేయవలసినసేవ జాతీయ విద్యా వ్యవస్థాపనం. యువకులకు భావదాస్యం తొలగిస్తే దేశానికి రాజకీయదాస్యం కూడా తొలగిపోతుంది. చిప్లుంకర్, ఆగర్కార్ అనే మిత్రులతో కలిసి తిలక్ న్యూ ఇంగ్లీష్ స్కూల్ స్థాపించాడు తరవాత దక్కన్ ఎడ్యుకేషన్ సొసైటీని ఏర్పాటుచేసి ఫెర్గూసన్ కళాశాలను స్థాపించాడు.

భవిష్యత్తును తీర్చిదిద్దడానికి కావలసిన నూతన భావాలను వ్యాపకంచేసే నూతన కార్యక్రమాలను చేపట్టడానికి ప్రోత్సాహం ఇచ్చే ఉత్తేజనకరాలైన వ్యాసాలూ, వ్యాఖ్యలూ అందించడానికి 'మహరాతా' అనే ఇంగ్లీషు పత్రికనూ, 'కేసరి' అనే మరాఠీ పత్రికనూ నడిపించాడు తిలక్

జనసామాన్యంలో చైతన్యం కలిగించడానికి జాతీయోత్సవాలు అవసరం అని తిలక్ అభిప్రాయం. గతమూ, వర్తమానమూ, భవిష్యత్తూ గొలుసులో కొక్కాల వంటివి. వాటికిగల సంబంధాన్ని ప్రజలు గుర్తించాలి. శివాజీ స్వాతంత్ర్యంకోసం పోరాడిన మహావీరుడు. స్వాతంత్ర్యేచ్ఛను సందీప్తం చేయడానికి శివాజీ ఉత్సవాలు ఏర్పాటుచేశాడు తిలక్. అలాగే గణపతి ఉత్సవాలు కూడా. ఆ సందర్భాలలో సభలు ఏర్పాటుచేసి రాజకీయ చైతన్యం కలిగించడానికి కూడా దోహదం చేశాడు. మారుమూలలలోని గ్రామాలలోని కుటీరాలకు కూడా రాజకీయ సందేశాన్ని అందజేయడానికి అనువైన ఉత్సవాలుగా వాటిని రూపొందించాడు.

భారతదేశానికి రాజకీయహక్కులను ప్రసాదించవలసినదిగా ఆంగ్ల విద్యాధికులైన భారతీయులు బ్రిటిష్ ప్రభుత్వానికి విజ్ఞాపనలూ విన్నపాల ద్వారా కొనసాగించిన ఉద్యమంగా నడిచింది అంతవరకూ కాంగ్రెస్ ఉద్యమం. స్వాతంత్ర్యోద్యమంలో జనసామాన్యానికి ఆసక్తినీ, అభినివేశాన్నీ కలిగించిన నాయకుడు బాల గంగాధరుడు.

బహిష్కారోద్యమానికీ, స్వదేశీ ఉద్యమానికీ నాయకత్వం వహించాడు తిలక్. విదేశవస్తువులనూ, విదేశీయ ఆచార సంప్రదాయాలనూ, విజాతీయవిద్యనూ విసర్జించాలి. విదేశీయాధికారం నుంచి విముక్తి పొందాలి. విదేశపద్ధతుల వ్యామోహంలో మన వ్యక్తిత్వం పోగొట్టుకొన్నాం. దుర్గతి నుంచి మనం ఉద్ధరింపబడాలంటే విదేశీయమైన ప్రతి దానిని విసర్జించాలి. ఇదే స్వదేశీ వ్రతం

విద్యావంతులేకాదు దేశస్థులలో అధిక సంఖ్యాకులకు కూడా జాతీయ ఉద్యమంలో ఉత్సాహం కలిగించడానికి తిలక్ పైసాఫండ్ అనే నిధిని నెలకొల్పాడు. ఒక్కొక్కరు ఒక్కొక్కపైసా (రూపాయలో 64వ వంతు అంటే ఇప్పటి ఒక్కటిన్నర పైసాకు ఇంచుమించు సమానం) ఇచ్చేవారు. ఎంతసొమ్ము వసూలైంది అన్న విషయంకాదు, ఎంతమంది ఈ ఉద్యమంలో పాల్గొన్నారన్నదే గమనింపదగినది. వసూలైన డబ్బుతో ఒకగాజు ఫ్యాక్టరీని స్థాపించారు. దేశోద్ధరణకు దేశీయులందరూ కృషి చేయాలన్నదే తిలక్ ఉద్యమ లక్ష్యం. ఈ ఉద్యమవ్యాప్తితో ఆయన అఖిలభారత స్థాయి నాయకుడయ్యాడు.

పారతంత్ర్యంలో ఉన్న జాతిపురోగమించాలంటే పెళ్లినడక ప్రయాణంవల్ల ప్రయోజనం ఉండదు. స్వాతంత్ర్యంవల్లనే ప్రగతి శీఘ్రతరం అవుతుంది. స్వాతంత్ర్యంకోసం చేసే సన్నాహం, జాతీయతా భావప్రబోధం, స్వాతంత్ర్యం పొందాలనే ఇచ్ఛను కల్పించడం, స్వాతంత్ర్యం పొందడానికి అవసరమైన సాధనాలను సమకూర్చడం, స్వాతంత్ర్య సముపార్జన యత్నంలో సంభవించే కష్టాలను అనుభవించడానికి సిద్ధపడడం-ఇవే మన ప్రగతిలక్షణాలు అనే భావాలే తిలక్ రాజకీయాలను నియమితం చేశాయి.

కేసరి పత్రికలో ప్రచురింపబడిన కొన్ని వ్యాసాలు రాజద్రోహపూరితంగా ఉన్నయన్న అభియోగం తెచ్చింది ప్రభుత్వం. ఆయనకు ఆరు సంవత్సరాల కారాగారశిక్ష విధింపబడింది ఆయన బర్మాదేశంలోని మాండలేలో ప్రవాసం చేశాడు. కారాగారవాస క్లేశం అనుభవిస్తూనే ఆ మహానుభావుడు 'గీతారహస్యం' అనే ఉద్గ్రంథం రచించాడు. ఫ్రెంచి, జర్మన్, పాలీభాషలనుకూడా అభ్యసించాడు.

కారాగారం నుంచి విముక్తి పొంది తిలక్ 1914లో స్వదేశానికి వచ్చాడు. ఎన్నో సంవత్సరాల తరవాత మళ్లీ ప్రజలతో సంబంధం ఏర్పడింది. పైసాఫండ్, స్వదేశీఉద్యమం, గణపతి ఉత్సవాలు మళ్లీ కొత్త చిగుళ్లు తొడుగుతున్నాయి. యువకులకు గీతారహస్యాన్ని బోధించాడు

1916 లో తిలక్ మహాశయుని షష్టిపూర్తి జరిగింది. ప్రజలు భక్తిప్రపత్తులతో లక్ష రూపాయలు కానుకగా ఇచ్చారు. ఆ సందర్భంలో ఆయన ఇలా ఉద్బోధించాడు "మన ముందర చాలా విస్తృతమైన పని ఉంది. ఆలస్యం చేయడానికి వీలులేదు. మాతృదేశం మనల్ని పిలుస్తూఉంది స్పర్ధలకూ, అసూయకూ సమయంకాదు. పరమేశ్వరుడు అందరికీ కార్యనిర్వహణానికి కావలసినస్ఫూర్తి ఇవ్వాలని ప్రార్థిస్తున్నాను. ఈ ప్రయత్నఫలం నేను కన్నులారా చూడగలగాలని కోరుకొంటున్నాను."

1918లో లోకమాన్యుడు ఇంగ్లండు వెళ్లి అక్కడ పది మాసాలు ఉండి, భారత స్వాతంత్ర్యం కోసం విశేషమైన కృషి చేశాడు. లేబర్‌పార్టీ నాయకులతో సన్నిహితసంబంధాలు ఏర్పరుచుకొన్నాడు. బహిరంగసభలలో ఉపన్యసించాడు. అనేక విధాల ప్రచారం చేశాడు.

1919లో తిలక్ భారతదేశానికి తిరిగివచ్చాడు మాంటేగ్యూ చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు ప్రకటింపబడ్డాయి. ఎన్నికైన సభ్యులు అధిక సంఖ్యాకులుగా ఉండే కేంద్ర శాసనసభను ఏర్పాటు

అయ్యే నిబంధన చేయబడింది. కాంగ్రెస్ డెమోక్రాటిక్ పార్టీని స్థాపించాడు తిలక్. మాండేక్యూ సంస్కరణలను ఆమోదించి సహకరించడం, పరిపూర్ణ స్వాతంత్ర్యం కోసం చట్టబద్ధమైన చర్యలు తీసుకొంటూ ఉండడం పార్టీ లక్ష్యాలు. అప్పటికే గాంధీజీ ప్రాబల్యం హెచ్చి ఆయన నాయకత్వం అనివార్యమౌతున్నందువల్ల గాంధీజీ రూపొందిస్తున్న సహాయ నిరాకరణ కార్యక్రమ విషయంలో లోకమాన్యుడు మహాత్మునితో కలహింపదలచుకోలేదు తిలక్ యుగం సమాప్తమై గాంధీయుగం ప్రారంభమయింది.

1920 జూలైలో లోకమాన్యుని ఆరోగ్యం క్షీణించింది. సంధిలో కూడా దేశాన్ని గురించే పలకరించాడు. స్వరాజ్యం వస్తేనే కాని భారతదేశం చెందదని ఆరాటపడేవాడు.

యదా యదా హి ధర్మస్యగ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాం మధర్మస్య తదాత్మనం సృజా మ్యహమ్
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే

ఈ గీతాశ్లోకాలు లోకమాన్యుని నోటి నుంచి ముందుగా నిర్గమించాయి. ఆ తరవాత నిశ్శబ్దం ... ఆ తరవాత జ్యోతి నిర్వాణమయింది అప్పటికి ఆగస్టు 1వ తేదీ ప్రవేశించి 40 నిమిషాలయింది.

## ఇద్దరు ప్రముఖ పత్రికా రచయితల నిర్యాణం

### జి. వి. కృపానిధి

ప్రముఖ పత్రికా రచయిత శ్రీ జి. వి. కృపానిధి మే 6వ తేదీన మైసూరులో మరణించారు. ఆయన వయస్సు 74 సంవత్సరాలు.

శ్రీ కృపానిధి యావద్భారత ప్రఖ్యాతి చెందిన పత్రికా రచయిత. 'స్వరాజ్య' పత్రికలో శ్రీ టంగుటూరి ప్రకాశంగారితో కలిసి పనిచేయడంతో ఆయన పత్రికా రచనా వ్యాసంగం ప్రారంభమైంది.

"ఇండియన్ న్యూస్ క్రానికల్" పత్రిక స్థాపకుల్లో శ్రీ కృపానిధి ఒకరు. 1947 నుండి 1950 వరకు ఆ పత్రిక సంపాదకులుగా పనిచేశారు. హిందూస్థాన్ పత్రిక సంయుక్త సంపాదక పదవి నుండి 1957లో రిటైరైన తర్వాత శ్రీ కృపానిధి మద్రాసులోని దక్షిణ భాషా పుస్తక సంస్థ జనరల్ మేనేజరుగా పదవి స్వీకరించారు. 1958 నుండి 1966 వరకు "దక్కన్ హెరాల్డ్" పత్రిక సంపాదకులుగా పనిచేశారు.

శ్రీ కృపానిధి జననం 1896 జూన్ 24వ తేదీ, కృష్ణాజిల్లా మచిలీపట్టణంలో. మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఉన్నత శ్రేణితో బి. ఎ. (ఆనర్స్) పట్టంపొందారు. తారువాత న్యాయశాస్త్రం అభ్యసించారు 1921లో కాంగ్రెసు సంస్థ పిలుపుననుసరించి న్యాయవాద వృత్తిని వదలివేశారు.

### కోలవెన్ను రామకోటేశ్వర రావు

'త్రివేణి' పత్రికా సంపాదకులు, ప్రముఖ పత్రికారచయిత శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు మే 19వ తేదీన నరసరావు పేటలో స్వర్గస్థులైనారు.

ప్రఖ్యాత బ్రిటిష్ పండితుడు సర్ ఆస్వాల్డ్ కూల్డ్రే వద్ద తర్ఫీదుపొందిన యువకరత్నాలలో శ్రీ కోటేశ్వర రావుగారు ఒకరు. కూల్డ్రే యీ శతాబ్ద ప్రారంభకాలంలో రాజమండ్రి ఆర్ట్స్ కళాశాల ప్రిన్సిపాలుగా వుండేవారు. శ్రీ రామకోటేశ్వరరావు చాలా చిన్నప్పుడే గాంధీజీ ప్రభావానికిలోనై న్యాయవాద వృత్తిని వదలి కాంగ్రెసు కార్యకర్తగా పనిచేయడం ప్రారంభించారు. కొంతకాలం శ్రీ ప్రకాశంపంతులుగారి "స్వరాజ్య" పత్రికలో పనిచేశారు. కొన్నేళ్లు కృష్ణాపత్రిక సంపాదకులుగా వున్నారు. బందరులోని ఆంధ్ర జాతీయ కళాశాల ప్రిన్సిపాలుగా కూడా పని చేశారు.

'త్రివేణి' పత్రికకు తన జీవితాన్ని అంకితంచేసి ఆదర్శవంతమైన పత్రికా రచయితగా శ్రీ రామకోటేశ్వర రావు కాలం గడిపారు. ఆయనవంటి సమర్థులైన సంపాదకులు అరుదుగా వుంటారు. సాహిత్య రంగంలో ప్రసిద్ధుడు, మంచి కళాప్రియుడు, స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ రామకోటేశ్వరరావు.

# శ్రీ కోలాచలం శ్రీనివాసరావు

—ఉమ్మెత్తల నరసింహమూర్తి

శ్రీ కోలాచలము శ్రీనివాసరావుగారు హంపీ విరూపాక్ష క్షేత్రంలోని కమలాపురంలో 13_3_1851 సంవత్సరములో జన్మించారు. వీరు మల్లినాథసూరి వంశీయులు. ఈయన పూర్వులంతా విజయనగర సంస్థాన పండితులు.

శ్రీనివాసరావుగారు జ్యోతిష్కులు నాటక రచయిత. నాటకాంత సాహిత్యం ఎరిగినవారు 1876 లో ఎఫ్. ఏ (F. A) ముగిసిం తరువాత రెవిన్యూ డిపార్టుమెంట్‌లో పనిచేసి 1881 లో అనంతపురం డిప్యూటి కలెక్టర్‌వద్ద దివానుగా పనిచేశారు.

1888లో రెండవ తరగతి ప్లీడరు పరీక్షలో ఉత్తీర్ణులై బళ్లారి న్యాయవాది పదవిని చేపట్టారు అప్పటినుండి వీరి సారస్వత సేవ అభ్యుదయ మార్గంలో పడింది. 1917 లో కడపలో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషత్సభ శ్రీనివాసరావుగారి అధ్యక్షతలో కొనసాగినది ఆ సమయంలో వీరి పాండిత్యాన్ని గూర్చి మండపాక పార్వతీశ్వర శాస్త్రి ప్రభృతులు కొనియాడారు.

శ్రీనివాసరావుగారు సునందినీ పరిణయము, మదాలసా పరిణయము, శ్రీరామజననము పాదుకా పట్టాభిషేకము, హరిశ్చంద్ర, రుక్మాంగద, చంద్రహాస కాళిదాసు, ప్రహ్లాద, మైసూరు రాజ్యము, ఆంధ్రకృతాగస్త్య బాలభారతము_ఇలాంటి ఇంకెన్నో రచనలు గావించారు.

కృష్ణమాచార్యుల వారి 'చిత్రనళీయము' ఎంతపేరు సంపాదించినదో శ్రీనివావరావు గారి 'రామరాజు చరిత్ర' అంత పేరు గాంచింది 'రామరాజు చరిత్రము' చారిత్రకమైన కథ. తల్లికోట యుద్ధములో కీర్తిశేషుడైన యశియ రామరాజు కథ ఇందు చిత్రించబడింది.

వీరు రచించిన మైసూరు రాజ్యము, ప్రతాపరుద్రీయము మొదలయినవి కూడ చరిత్రకములు

వీరికి గ్రామ్యభాష అంటే కిట్టదు. కళాశాలలో గ్రామ్యాన్ని ఉపయోగించవచ్చు అన్నప్పుడు మదరాసు విశ్వవిద్యాలయము వారు ఏర్పాటుచేసిన సంఘమునకు అధ్యక్షపదవి నలంకరించి వ్యవహారికము మీద నిరసన తెలియచేశారు. వీరికి విషాదాంత నాటకాలన్న అయిష్టత సాంస్కృతాది భాషలకు బదులు వ్యావహారిక భాషను ఉపయోగించ వచ్చునన్న వేదము వారి మతము సైతము వీరికి సమ్మతముకాదు చారిత్రకములు, సంఘ సాంబంధికములు అయిన నాటకాలే ఇప్పుడు కూడ వెలువడాలని వీరి కాంక్ష

“భాషను చెరచుట తప్పు. అశ్లీలములుంచుట తప్పు. దుర్నీతికరములుగా ఉండుట తప్పు. బండ బూతు మాటల నీతి చెప్పుట తప్పు. పేరుపెట్టి యెత్తిపయుట తప్పు. గ్రంథము నందిత్యాదులు తప్పులగునుగాని మిగిత వితప్పులుగావు. విషయ వైశద్యము కొంత వఱకు ఉండినచాలు. లోహములన్నీ స్వర్ణమయం కాకపోయినా పనికిమాలిన వేపికాపు పూర్వ కాలమునుండి బుద్ధి కుశలులని పేరందిన పండితుల గ్రంథములు చదివి తమ బుద్ధిబలిమివి వానికి చేర్చి యిప్పటి వారు వ్రాయు గ్రంథములు చెడెనని చెప్పడము అసమంజసము” ఇదే తెనుగునకు శ్రీనివాసరావు గారిచ్చిన సందేశము.

శ్రీనివాసరావుగారు ఉదారస్వభావులు. పండితులను సత్కరించి గౌరవించారు. కవులను సన్మానించారు. పేదలను పోషించారు.

శ్రీనివాసరావుగారు 20_6_1919 లో కన్నుమూశారు.

తెలుగునాట నాటక శబ్దమున్నంత వరకు శ్రీనివాసరావుగారి పేరు ఉండుట నిశ్చయము.

# నగరంలో

మే నెల 6వ తేదీన హైదరాబాదులోని ఆంధ్ర సారస్వత పరిషత్ ఆవరణలో జరిగిన బహిరంగ సభలో కళాప్రపూర్ణ, కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారికి కేంద్ర సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వ ప్రదానం చేయబడింది. నగరంలోని కవులు, పండితులు, పలువురు పురప్రముఖులు సభకు హాజరయ్యారు. కేంద్ర సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులు ప్రొఫెసర్ శ్రీనివాస అయ్యంగారు సభకు అధ్యక్షత వహించారు.



శాసనమండలి అధ్యక్షులు శ్రీ పిడతల రంగారెడ్డి, 18-4-70 తేదీన, హైదరాబాదు, బషీర్‌బాగ్‌లోని "ఆంధ్ర పత్రిక" కార్యాలయంలో, కీ. శే. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి 32వ వర్ధంతి సభలో ప్రసంగించారు



ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్, రైల్వే వారోత్సవాల సందర్భంలో, 15-4-70 తేదీన సికిందరాబాదులోని రైల్వే రిక్రియేషన్ క్లబ్బులో సిబ్బందికి అవార్డులనూ, విజేతలకు బహుమతులనూ అందజేశారు



ఉత్తరప్రదేశ్ గవర్నరు డా. బెజవాడ గోపాలరెడ్డి మే 30వ తేదీన హైదరాబాదులో తెలుగు కావ్యం "ఋతుఘోష"కు ఇంగ్లీషు అనువాదమైన "క్రై ఆఫ్ ది సీజన్స్"ను ఆవిష్కరించారు. దీనిని రాజకుమారి ఇందిరాదేవి ధన్‌రాజ్‌గిర్, అనువదించారు. రాష్ట్ర గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ అధ్యక్షత వహించారు.



ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు డా. రావాడ సత్యనారాయణ 19-4-70 తేదీన ఎగ్జిబిషన్ క్లబ్‌లో లెనిన్ గురించి జరిపిన గోష్ఠికి ప్రారంభోత్సవం చేశారు. ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావు ఈ సందర్భంలో పాల్గొన్నారు

ఆదే సభలో, 1969 సంవత్సరానికి కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతులు పొందిన శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారికీ, కీ. శే. మగ్దుం మొహియుద్దీన్ (మరణానంతరం) గారికీ బహుమతీ ప్రదానం జరిగింది. శ్రీ మగ్దుం సతీమణి యీ బహుమతిని అందుకున్నారు.

కేంద్ర సాహిత్య అకాడమీకి చెందిన శ్రీ కేల్కార్ ప్రసంగిస్తూ కేంద్ర సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వం పొందిన



శాసనసభ స్పీకరు శ్రీ బి. వి. సుబ్బారెడ్డి, లండన్‌లో పార్లమెంటరీ సమావేశానికి హాజరై 30-4-70 తేదీన హైదరాబాదుకు తిరిగి వచ్చారు.



సమాచార, పౌర సంబంధశాఖా మంత్రి శ్రీ ఎ. వాసుదేవరావు 20-4-70 తేదీన ఫిల్ము షూటింగుకు ప్రారంభోత్సవం చేశారు.

వారిలో శ్రీ విశ్వనాథ 9వ వారు అని వివరించారు. విశిష్ట సభ్యత్వ స్థానాలు 21 వున్నాయి. డాక్టర్ రాధాకృష్ణన్, రాజాజీ, తారా శంకర బెనర్జీ మొదలగు వారికి లోగడ యీ గౌరవం లభించింది.

## రాష్ట్ర కార్మిక వ్యవహారాల సలహా సంఘం

మే 5వ తేదీన సెక్రెటేరియట్ కమిటీ హాల్లో రాష్ట్ర కార్మిక వ్యవహారాల సలహా సంఘం 20వ సమావేశం జరిగింది. కార్మిక శాఖామాత్యులు శ్రీ జి. సంజీవరెడ్డి అధ్యక్షత వహించారు. సలహా సంఘం సభ్యులతోపాటు కార్మిక వ్యవహారాల్లో అనుభవజ్ఞులైన 25 మంది ప్రముఖులు కూడా హాజరయ్యారు. కార్మిక సంబంధాల కమిషన్ బిల్లు, ఫ్యాక్టరీల (జాతీయ పండుగలు, సెలవులు) బిల్లు మొదలైన విషయాలు చర్చించారు. ఈ బిల్లులు శాసన సభలో గత సమావేశంలో ప్రవేశ పెట్టబడినవి.

జీతంమీద యిచ్చే సెలవలను 7 నుండి 8కి పెంచుతూ ఫ్యాక్టరీల బిల్లులో చేసిన ప్రతిపాదనను సలహా సంఘం అంగీకరించింది.



కార్మిక శాఖా మంత్రి శ్రీ జి. సంజీవరెడ్డి, మే 5వ తేదీన హైదరాబాదులో సచివాలయంలోని కమిటీహాలులో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కార్మిక సలహా మండలి సమావేశంలో ప్రసంగించారు.



లెనిన్ గురించిన స్టాంపుల ప్రదర్శన

# కోకా-కోలా సాంగత్యం బ్రతుకే ఒక సారస్యం

ఆటలాడటంలో ఆనందం...ఆటగాండ్రలో పెల్లుబికే ఉల్లాసం! కోకా-కోలా తోడైతే, ఇది పరిమళమబ్బిన బంగారం! ఉల్లాసం ఉత్తేజం కలిగించే సజీవమైన రుచి కోకా-కోలా రుచి. అందుకనే, త్రాగాలనిపిస్తుంది మళ్ళీ మళ్ళీ. త్రాగండి కోకా-కోలా-మళ్ళీ కోకా-కోలా—మళ్ళీ మళ్ళీ కోకా-కోలా! ప్రపంచంలో నలుమూలలా, పెరిగిపోతోంది కోకా-కోలా త్రాగేవారి సంఖ్య రోజు రోజుకూ. కారణం: సేదదీర్చటంలో, కనివిని ఎరుగని కమ్మదనం, కోకా-కోలా కమ్మదనం!




కోకా-కోలా, కోకా-కోలా కంపెనీవారి రిజిస్టరు చేయబడిన ట్రేడ్ మార్క్.

CMCC-14-203 TEL

# శ్రీ జగన్మోహినీ కేశవస్వామి

శ్రీ జగన్మోహినీ కేశవస్వామివారి దేవాలయం తూర్పు గోదావరి జిల్లా కొత్త పేట తాలుకాలో గోదావరి, గౌతమి, వశిష్ఠ నదుల మధ్యగల ర్యాలి అనే గ్రామంలో ఉంది. ఈ గ్రామాన్ని మూడు నదులు చుట్టివేసినందువల్ల ఇది ద్వీపమైంది. ఈ గ్రామం గౌతమి వంతెనకు సుమారు మూడు మైళ్ళ దూరంలోవుంది. ఈ పవిత్రమైన పుణ్య క్షేత్రానికి బస్సులోకానీ, స్టీం లాంచిలోకాని వెళ్ళవచ్చు.

శ్రీ జగన్మోహినీ కేశవ స్వామి విగ్రహం శిల్పకళా నైపుణ్యానికి మచ్చుతునక. అందచందాలలో అపూర్వమైనది. విగ్రహం యొక్క ముందు భాగం "విష్ణు" మూర్తి ఆకారంలో ఉంది. వెనుకభాగం జగన్మోహిని రూపంలోవుంది. ఈ విగ్రహాన్ని మలచడానికి ఏ విధమైన రాయి ఉపయోగించబడిందో స్పష్టంగా తెలియదు. విగ్రహం పాదములనుంచి నిరంతరం నీరు ప్రవహిస్తూ వుంటుంది. ఇది అసాధారణమైన విషయం. వెనుక వైపున స్త్రీ స్వరూపంలోవున్న విగ్రహానికి తొడమీద ఒక పుట్టు మచ్చ వుంది. పద్మినీ జాతి స్త్రీలలో తొడపైన ఇట్టి మచ్చ ఒకటి సాధారణంగా ఉంటుందని చెబుతారు.

జగన్మోహినీ కేశవ స్వామి దేవాలయానికి అభిముఖంగా బహు కొద్ది దూరంలో పరమ శివుని ఆలయం వుంది. శ్రీ జగన్మోహినీ కేశవ స్వామి, పరమ శివుని ఆలయాలు ఒకదానికొకటి అభిముఖంగా వుండటం చాల అరుదైన విషయం. ఇందుకు పురాణ గాథ ఒకటి వుంది.

అతి ప్రాచీన కాలంలో దేవతలు రాక్షసులు కలిసి అమృతం కొరకు క్షీరసాగరాన్ని చిలికారు. క్షీర సాగర మథనంవల్ల, అందులోనుంచి అమృతం పుట్టింది. దీనికొరకు దేవాసురులమధ్య యుద్ధం ప్రబలిపోయింది. అంతంలేని ఈ యుద్ధాన్నిచూచి శ్రీ మహా విష్ణువు మోహిని అవతారము ధరించి తన జగదేక సౌందర్యంతో రాక్షసుల దృష్టిని మరల్చాడు. దేవతలకు అమృతం లభించింది.

ఈ వార్తను శంకరుడు విని జగన్మోహిని ఆకారంలో తనకు ప్రత్యక్షం కావలసిందని అర్థించాడు. పార్వతీపరమేశ్వరులకు ఒకనాడు ఒక సుందర ఉద్యానవనంలో అపూర్వమైన జగదేక సుందరి కనపడింది. పరమ శివుడు ఆమెను ప్రేమించి, ఆమెను పట్టుకొనడానికి ప్రయత్నించాడు. కాని జగన్మోహిని పరమ శివునకు అందకుండా తప్పించుకొంటూ పోయింది. ఈ విధంగా తరుముకుంటూరాగా పరమ శివుడు, జగన్మోహిని ర్యాలి నగరంలోని ఈ పవిత్ర స్థానాన్ని చేరుకున్నారు. ఆ సమయంలో శంకరునికి ముందువున్న జగన్మోహిని వెనుకకు తిరిగి చూచింది. శంకరునికి మహావిష్ణువు ముఖం కనిపించింది. కాని జగన్మోహిని కనిపించలేదు. శంకరుడు వెంటనే లింగాకృతి ధరించాడు. వెనుక వైపు జగన్మోహిని ఆకారంలో మహా విష్ణువు శిలా ప్రతిమ ఆకారంలో నిలిచిపోయాడు.

ప్రస్తుతం ఈ దేవాలయ సంఘానికి శ్రీ కల్లేపల్లి వెంకట కృష్ణా రావు, ట్రస్టీ అధ్యక్షులుగా వున్నారు. గర్భాలయంలో రెండు



స్ఫటిక రాళ్లను ఆయన ఏర్పాటు చేయించారు. ముఖ మంటపం అత్యంత సుందరంగా అలంకరించబడింది. దేవాలయంలోపల వెలుపల విద్యుద్దీపాలు ఏర్పాటు చేయబడినాయి.

ఈ దేవాలయానికి దూర దూర ప్రాంతాలనుంచికూడా వేల కొలది యాత్రికులు వస్తారు. ఇక్కడ వెలసివున్న దేవుని భక్తితో పూజించినట్లయితే కోరికలు నెరవేరుతాయని చాలమంది యాత్రికులు చెబుతారు. ఇక్కడ యాత్రికులకు సౌకర్యాలు కల్పించబడినాయి. దేవస్థానం సత్రం ఒకటి వుంది. పొద్దున్న వేద పారాయణం, సాయంత్రం పురాణ కాలక్షేపం జరుగుతుంది. ఉదయం గీతోపన్యాసాలుకూడా వుంటాయి. శారదా పాఠశాల, సంస్కృత పాఠశాలలను నిర్వహించాలని ట్రస్టీ సభ్యులు అభిప్రాయపడుతున్నారు. ఇటీవల హైదరాబాదునుంచి జర్నలిస్టుల జట్టు ఒకటి ఈ దేవాలయాన్ని దర్శించింది. 




## జయంతి

(ఖండకావ్య సంపుటి)

రచన : శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి. 92 పేజీలు. వెల రు. 2-50. ప్రతులకు రచయిత పేర 13-6-675 కారవాన్ సాహు, హైదరాబాదు-6 అనిగానీ, శ్రీ పరమేశ్వర పబ్లికేషన్స్ చిక్కడపల్లి, హైదరాబాదు-20 అనిగానీ రాయాలి.

శ్రీ వీరభద్రమూర్తిగారు చేయితిరిగిన పద్య రచయిత. బహు గ్రంథకర్త. మూకపంచశతి, టంగుటూరి ప్రకాశం పంతులు జీవిత చరిత్ర, భారత స్వాతంత్ర్య సంగ్రామం, మహామరకతము మొదలగు అనేక కావ్యాలు రాశారు. తెలుగు పద్య రచనా శిల్ప మర్మజ్ఞులు.

ఈ ఖండికా సంపుటిలో 25 ఖండికలు వున్నాయి. చాలా భాగము ఉగాది వసంతము, సహకారము, విజయదశమి వంటి ఆయా సందర్భములలో రాసినవి. ఆకాశవాణిద్వారానూ, ఆంధ్ర ప్రదేశ్, ఆంధ్రప్రభ, కృష్ణాపత్రిక వంటి పత్రికల ద్వారానూ యిదివరకే ప్రకటించబడినవి.

సుప్రసిద్ధ కవివర్యులు శ్రీ నాయని సుబ్బారావుగారు యీ గ్రంథానికి పీఠిక రాస్తూ "భావనా వ్యాపారములో, భావ వ్యక్తీకరణములో, శబ్ద ప్రయోగములో నీకవిదొక విలక్షణమైన పద్ధతి" అని మెచ్చుకున్నారు. వీరభద్రమూర్తిగారిలో సంప్రదాయజ్ఞత ఎంత వున్నదో, అంతకంటె ఎక్కువగా క్రొత్త పోకడలు పోవలెననే అభిలాష కూడా వున్నది. అక్కడక్కడ ప్రబంధ ధోరణి పద్యాలు కూడా కనిపిస్తాయి. స్వతంత్రం వచ్చిన తర్వాత ప్రియా ప్రియుల సంభాషణ జరిగినట్లు భావించిన పద్యం కేవలం ప్రబంధాల కాలంలో రాయదగింది.

"పూవులులేవు ధూపమును పూజ్యము, నూవియనున్న దీనతా
కేవలమైన నీ సిగకు గేదగి వాసనలల్లుకొన్న వె
ట్లే? వెలదీ!"............(అని ప్రియుడు అడుగగా)
"ప్రియా, పరిమళించని పోచయులేదు నేడు స్వేచ్ఛా
విలసన్మహోత్సవ వశంబున భారత మండలమ్మునన్"......

అని ప్రియురాలు బదులు చెప్తుంది. ఇదే విధంగా కృతి భర్త శ్రీ దేవులపల్లి రామానుజరావుగారిని గురించి చెప్పిన పద్యాలలో విష్ణుమూర్తి, లక్ష్మీదేవుల సంభాషణల పద్యం ఒకటి వుంది. 'రామానుజ' శబ్దంమీద చమత్కారముచేసి ఈ పద్యాన్ని చిత్రంగా నడిపారు కవిగారు.

ఏమీలేనిచోట గాలిపోగుచేసినట్లు అవలీలగా రూపకాలంకార సామగ్రిని సృష్టించుకోవడంలో నేర్పరి వీరభద్రమూర్తిగారు. పండిత నెహ్రూ ప్రజ్ఞ "రాజకీయ హిమాచలము" మీద ఎవరెస్టు శిఖరమనీ, ఆయన కార్యస్ఫూర్తి "ప్రజాభావుక మహారాజ వీథి" యందు "యిభరాజ గమన"మనీ వర్ణించారు. భారత జాతీయ పతాకను "దిగ్విజయంబను దృశ్య కావ్యపు వసుధైక కుటుంబ పతాక" ముగా భావించినారు.

"నీవుజెండావెకాదు, 'ఎజెండా'వు భావిభావుకోదంతములకు" అని చమత్కరించినారు. 'బహు సంతానం' అనే శీర్షిక క్రింద, అప్పటికే కుచేలత్వము పొందిన కథానాయకుడు, గురువుగారు యింటికి రాగానే, 'పుత్రప్రాప్తిరస్తు" అని దీవించకండి బాబూ అని ప్రాధేయపడినట్లు కల్పన చేయడం రమణీయంగా వుంది.

కృతికర్త "సితరోచిఃఖండ భృద్దేవతా" ప్రియుడు. వీర శైవము నందువలె జాతీయ భావములయందు కూడా అత్యంత ఆదరణ కలవాడు. అందరూ చదువదగిన ఖండకావ్య సంపుటి యిది.

## సంఘర్షణ

(కవితా సంకలనం)

ప్రతులకు : యువ రచయితల సమితి, నల్లగొండ
50 పేజీలు. వెల రు. 1-50

ఈ సంకలనంలో సోమసుందర్, కాళోజీ వరవరరావు, అద్దేపల్లి రామమోహనరావు వంటి లబ్ధప్రతిష్ఠులతోపాటు మొత్తం సుమారు 25 మంది కవుల రచనలు వున్నాయి. గ్రంథమంతటిలో తలమానికంగాఉన్న రచన కాళోజీ రాసిన "గొర్రెదాటు" ఇది అత్యంత ధ్వనిమంతమైన రచన. శ్రీ ఎన్. గోపి "అనుకోలేదు జీవిత మిలా వుంటుందని, అలలు అలలుగా కదులుతున్న పైరులాంటి వ్యూహంమీద వడగళ్ళవాన కురుస్తుందని". అయినా యీ రచయిత సాగి పోతున్నాడు :

"హృదయంలో ఉదయం మేలుకునే సీమవైపు
మొగ్గలలో రేపుకోసం నిరీక్షిస్తున్న
భవిష్యత్తు రంగులతో కళ్ళు వెలిగించుకుందామని"

యువతరంలో అలముకున్న నిరాశా, నిస్పృహలకూ, అయినా ఏదో చేయాలనే ఉత్సాహానికీ యీ గేయం వుదాహరణ. ఈ గ్రంథానికి శ్రీ సి. నారాయణరెడ్డి "అభినందిస్తున్నాను" అంటూ ముందుమాట రాశారు.

## కవితా కుసుమాలు

సమర్పణ : కల్చరల్ క్లబ్, పున్నమ్మతోట, విజయవాడ-2.

ప్రతులకు : కృష్ణమోహన్ అండ్ కో, సామారంగం చౌక్, విజయవాడ-1. వెల 80 పైసలు.

ఇందులో 'మురళీకృష్ణ', భీశెట్టి లక్ష్మణరావు, బోసుబాబు, కుమారి వింజమూరి లక్ష్మి ప్రభృతులైన 12 మంది యువరచయితలున్నారు. రచనలు మొత్తంమీద "ఒక మోస్తరు"గా ఉన్నాయి. ఇంకా సాధన చేయవలసిన అవసరం వున్నట్లు కనిపిస్తుంది. క్లబ్ వారు యీ విధంగా కవితా సంకలనం వెలువరించడం ప్రశంసాపాత్రమైన కృషి.

—చైతన్య.

# జిల్లా వార్తలు

## సుగాలి కాలనీకి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం

ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గుంటూరు జిల్లా చిలకలూరుపేటలో మాట్లాడుతూ రాష్ట్రంలో ఇంతవరకు 16 లక్షల ఎకరాల బంజరు భూములు, భూములులేని బీదవారికి పంచి పెట్టడం జరిగిందనీ, త్వరలోనే మరొక 6 లక్షల ఎకరాలు పంచి పెట్టడం జరుగుతుందనీ చెప్పారు.

నరసరావుపేట రోటరీ క్లబ్బు సహాయంతో, జిల్లా తుఫాను బాధితుల సహాయక సంఘం రూ. 1.6 లక్షల ఖర్చుతో నిర్మించిన "గాంధీనగర్" సుగాలీ కాలనీకి ప్రారంభోత్సవం జరుపుతూ ముఖ్యమంత్రి పై విషయాన్ని వెల్లడించారు. ఈ కాలనీలో 126 సుగాలీ కుటుంబీకులకు గృహవసతి కల్పించబడింది. ఈ సందర్భంలో ఏర్పాటైన బహిరంగ సభకు కలెక్టరు శ్రీ వెంకటరత్నం అధ్యక్షత వహించారు.

రాజకీయ స్వప్రయోజనాలదృష్టితో బలవంతంగా భూములను ఆక్రమించుకొన్న వారిని ముఖ్యమంత్రి ఖండించారు. అట్టివారిపైన తీవ్రమైన చర్యలు తీసుకోబడుతాయని ఆయన హెచ్చరించారు. దేశంలో బీద ప్రజలను ఉద్ధరించాలని, నూతన ఆర్థిక, సాంఘిక వ్యవస్థను ఏర్పాటుచేయడానికి ధనవంతులు తోడ్పడాలని ఆయన చెప్పారు.

శ్రీ కె వెంగళరెడ్డి, యం యల్.సి. జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ యం. నాగేశ్వరరావు గారలు కూడా ఈ సభలో ప్రసంగించారు. అంతకుముందు ఈకాలనిలో స్కూలు భవనానికి ముఖ్యమంత్రి శంకుస్థాపనచేశారు.



ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, ఏప్రిల్ 21వ తేదీన, గుంటూరు సమీపంలోని తూబాడులో హరిజన కాలనీకి ప్రారంభోత్సవం చేశారు. శ్రీమతి రాఘవమ్మా బ్రహ్మానందరెడ్డిని, జిల్లా కలెక్టరు శ్రీ ఎం. వెంకటరత్నంను కూడా ఈ ఫోటోలో చూడవచ్చు.

## తూబాడు హరిజన కాలనీకి ప్రారంభోత్సవం

ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గుంటూరు దగ్గర తూబాడులో హరిజన ఇండ్ల కాలనీకి ప్రారంభోత్సవం జరిపారు. 110 హరిజన కుటుంబాలకు ఇక్కడ ఇండ్లు నిర్మించబడ్డాయి. ఒక్కొక్క ఇంటికి రూ. 1400 లు ఖర్చుఅయింది. ఈ సందర్భంలో ఏర్పాటైన బహిరంగ సభకు జిల్లా కలెక్టరు శ్రీ యం. వెంకటరత్నం అధ్యక్షత వహించారు.

తిరుమామిళ్లలో 108 హరిజన కుటుంబాలకు నిర్మించిన ఇండ్ల కాలనీకి కూడా ముఖ్యమంత్రి ప్రారంభోత్సవంచేశారు ఒక్కొక్క ఇంటిని నిర్మించడానికి రూ. 1400 లు ఖర్చుఅయింది.

## ఆయుర్వేద ఆసుపత్రికి ప్రారంభోత్సవం

సమాచార, పౌర సంబంధ శాఖా మంత్రి శ్రీ ఎ. వాసుదేవరావు ఇటీవల నెల్లూరు జిల్లా కోట పంచాయతీ సమితిలోని మద్దపల్లిలో ఆయుర్వేద ఆసుపత్రికి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో ఆయన మాట్లాడుతూ గ్రామంనుంచి రాష్ట్రస్థాయి వరకు అన్ని దశలలో జాతీయ సమైక్యతను నెలకొల్పాలని ఉద్బోధించారు.

గ్రామస్థులందరూ ఒక త్రాటిపై నడచి, వారి నాయకుల ద్వారా అభివృద్ధి కార్యక్రమాలను అమలుపరిచేట్లు చూడాలని ఆయన కోరారు. నక్సలైట్ల దురాగతాలను అరికట్టడానికి ప్రభుత్వానికి ప్రజలు సహాయపడాలని కోరారు. అంతకుముందు మంత్రి 91 హరిజన గిరిజన కుటుంబాలకు ఇండ్ల స్థలాల పట్టాలను పంచిపెట్టారు. ఆ తర్వాత కొండాపురం, ఎర్రగాటుపల్లిలోను, బాలిరెడ్డిపాలెం, బసవనిపాలెం గ్రామాలలో హరిజనవాడలకు, వీధి లైట్లు, ఇండ్ల కనెక్షనులకు విద్యుచ్ఛక్తి సరఫరా మీట నొక్కారు. శ్రీ బి. పి. రెడ్డి. ఎం. ఎల్. ఎ. అధ్యక్షతవహించారు.



ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, ఏప్రిల్ 21 వ తేదీన, గుంటూరు సమీపంలోని చిరుమామిళ్ళలో హరిజన కాలనీకి ప్రారంభోత్సవం చేసిన సందర్భంలో బహిరంగ సభలో ప్రసంగించినప్పటి దృశ్యం.



గొట్టా బ్యారేజీ శంకుస్థాపన కార్యక్రమంలో ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, నీటిపారుదల శాఖామంత్రి శ్రీ శీలం సిద్ధారెడ్డి, ఛీఫ్ ఇంజనీరు కె. శ్రీనివాసరావు.

## జిల్లాపరిషత్తు సభ్యురాండ్రు తమిళనాడు పర్యటన

తమిళనాడులోని మహిళా సంక్షేమశాఖ, సాంఘిక సంక్షేమ మండలి, స్వచ్ఛంద సంస్థల పని విధానాన్ని పరిశీలించే నిమిత్తం హైదరాబాదు జిల్లా పరిషత్తు మహిళా సంక్షేమ విషయాల స్థాయీ సంఘానికి చెందిన సభ్యురాండ్రు ఇటీవల మే నెలలో మద్రాసు వెళ్ళారు. ఈ బృందంలో శ్రీమతి జుబేదా బేగం, శ్రీమతి శంకరమ్మ, శ్రీమతి రమాదేవి ప్రభృతులు ఉన్నారు. మహిళా సంక్షేమశాఖ మంత్రి శ్రీమతి రోడామిస్త్రీ, డైరెక్టరు శ్రీమతి శ్రీరాజ్యం సిన్హా సికింద్రాబాదు రైలు స్టేషనులో వారికి వీడ్కోలు చెప్పారు.

## జూనియర్ కళాశాలకు ప్రారంభోత్సవం

విద్యాశాఖామంత్రి శ్రీ పి. వి. నరసింహారావు, కరీంనగర్ జిల్లా మంథనిలో ఏప్రిల్ 22న తేదీన స్థానిక జిల్లాపరిషత్తు బాలుర ఉన్నత పాఠశాల ఆవరణలో జూనియర్ కళాశాలకు ప్రారంభోత్సవం చేశారు. ఈ ప్రారంభోత్సవ కార్యక్రమానికి జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ డి. హన్మంతరావు అధ్యక్షత వహించారు.

క్రొత్తగా ప్రారంభించిన ప్రతి జూనియర్ కళాశాలలోనూ తగినంతగా సిబ్బంది నియామకం జరిగేటట్లుగానూ, మంచి ప్రయోగశాలను, గ్రంథాలయాన్ని నెలకొల్పేటట్లుగానూ తాము శ్రద్ధవహించగలమని విద్యామంత్రి అన్నారు.

జిల్లాపరిషత్తు అధ్యక్షుడు ప్రసంగిస్తూ, కళాశాలయొక్క వివిధ అవసరాలను దృష్టిలోపెట్టుకొని మంచి భవనాన్ని నిర్మించడము కొరకు తగినన్ని నిధులను ప్రోగుచేయాలని ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

## పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం

మంథని పంచాయతీ సమితిలోని జిల్లారంలో ప్రాథమిక పాఠశాల భవనానికి విద్యామంత్రి ప్రారంభోత్సవం చేశారు.



గొట్టా బ్యారేజి ఉత్సవ సందర్భంలో గిరిజన వృద్ధులతో మాట్లాడుతున్న ముఖ్యమంత్రి

ఈ సందర్భంగా జరిగిన సమావేశంలో మంత్రి ప్రసంగిస్తూ విద్యార్జన ప్రాముఖ్యాన్ని వివరించి తమపిల్లలను పాఠశాలలకు సక్రమంగా పంపుతూ తద్వారా ప్రభుత్వం అమలు జరుపుతున్న విద్యా పథకాలు విజయవంతం చేయడంలో తోడ్పడాలని ఆయన ప్రజలకు విజ్ఞప్తిచేశారు.

## స్కూలు భవనానికి ప్రారంభోత్సవం

విద్యాశాఖామంత్రి శ్రీ పి. వి. నరసింహా రావు కరీంనగర్ జిల్లా మంథని పంచాయతి సమితిలోని జూలపల్లి గ్రామంలో ఇటీవల స్కూలు భవనానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో జరిగిన సభకుసమితి అధ్యక్షులు శ్రీ పి. కృష్ణారావు అధ్యక్షత వహించారు. సర్పంచ్ శ్రీ వీరారెడ్డి సన్మానపత్రం సమర్పించారు.



ఉపముఖ్య మంత్రి శ్రీ జె. వి. నరసింగరావు 20—4—70 తేదీన హైదరాబాదు జిల్లా, హయాత్‌నగర్ సమీపంలోని "బ్రహ్మానంద చిత్రపురి"లో నీటి సరఫరా పథకానికి ప్రారంభోత్సవం చేశారు.

## విద్యుచ్ఛక్తి సరఫరాకు ప్రారంభోత్సవం

(మంథని) పంచాయతీ సమితిలోని గంజపాడు గ్రామానికి ఏప్రిల్ 20 వ తేదీన విద్యుచ్ఛక్తి సరఫరాకు విద్యాశాఖ మంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో జరిగిన బహిరంగ సభకు సమితి అధ్యక్షులు శ్రీ పి. కృష్ణారావు అధ్యక్షత వహించారు.

## శ్రీశైలంలో అతిరుద్ర మహాయజ్ఞ పరిసమాప్తి

శ్రీశైలంలో ఏప్రిల్ 24 వ తేదీ నుండి ప్రారంభించబడిన అతిరుద్ర దశసహస్ర చండీయాగ మహాయజ్ఞం మే 4వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి సమక్షంలో 'పూర్ణాహుతి' కార్యక్రమంతోనూ, జగద్గురు శివగంగ పీఠాధిపతి ఆశీస్సులతోనూ పరిసమాప్తమయింది. యజ్ఞసమాప్తిని దాదాపు 6000 మంది తిలకించారు. దాదాపు 450 మంది ఋత్విక్కులు ఏప్రిల్ 24 నుండి మే 4వ తేదీ వరకు నిరంతరాయంగా యీ యజ్ఞంలో పాల్గొన్నారు.



శ్రీశైలంలో జరిగిన అతిరుద్ర దశ సహస్ర చండీయాగంలో, మే 4 వ తేదీన శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, శ్రీమతి రాఘవమ్మా బ్రహ్మానందరెడ్డి పాల్గొన్నారు.

ముఖ్యమంత్రితోపాటు, దేవాదాయశాఖమంత్రి శ్రీ ఆర్. రామలింగరాజు, అటవీశాఖమంత్రి శ్రీ సాగి సూర్యనారాయణ రాజు, సమాచారశాఖ మంత్రి శ్రీ ఎ. వాసుదేవరావు, రెవెన్యూ మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి, రవాణాశాఖమంత్రి డా॥ ఎం. ఎన్. లక్ష్మీనరసయ్య, మత్స్యపరిశ్రమశాఖమంత్రి శ్రీ ఎస్. ఆర్. ఎ. ఎస్. అప్పలనాయుడు, వాణిజ్యమంత్రి శ్రీ పి. అంకినీడు ప్రసాదరావు, హోంశాఖమంత్రి శ్రీ జలగం వెంగళరావు, దేవాదాయ శాఖ కమీషనరు శ్రీ కె. వాసుదేవరావు, తదితర ప్రముఖులు యజ్ఞశాలను దర్శించారు.

'పూర్ణాహుతి' సమయంలో శ్రీ బ్రహ్మానందరెడ్డి ప్రసంగిస్తూ మహాయజ్ఞం ద్వారా భగవంతుని ఆశీస్సులు అందుకొని మానవాళికి శాంతి, సౌఖ్యాలను చేకూర్చవచ్చునని అన్నారు.



ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి, ఏప్రిల్ 22వ తేదీన విజయవాడలో లఘుపరిశ్రమల దక్షిణ ప్రాంత మహాసభలో ప్రసంగించారు.

## జూనియర్ కళాశాలకు ప్రారంభోత్సవం

రాష్ట్ర హోంమంత్రి శ్రీ జె. వెంగళరావు ఖమ్మం సమితిలోని గోకినపల్లి గ్రామంలో జూనియర్ కళాశాలకు ప్రారంభోత్సవం చేస్తూ, ఈ జిల్లాకు యూనివర్శిటీ గ్రాంట్సు కమీషన్ వారు 4 జూనియర్ కళాశాలలు మాత్రమే సిఫార్సు చేసినప్పటికీ రాష్ట్ర విద్యాశాఖామంత్రి 10 జూనియర్ కళాశాలలను మంజూరు చేసినందుకు ఆయనను అభినందించారు. ఈ సౌకర్యాన్ని సద్వినియోగం చేసుకోవాలని హోంమంత్రి విద్యార్థులను కోరారు.

తెలంగాణా ఆందోళనను గురించి ప్రస్తావిస్తూ, ప్రజాస్వామ్య పద్ధతులపైన ఏ ఆందోళన లేవదీసిన ప్రభుత్వానికి ఆక్షేపణ వుండదనీ, అయితే ప్రజాస్వామ్య పద్ధతులకు విరుద్ధంగా ఆందోళన చేసినట్టయితే దానిని అణచివేయడమే ప్రభుత్వ విధానమనీ ఆయన చెప్పారు.

ఈ సభకు సమితి అధ్యక్షులు శ్రీ ఉపేంద్రయ్య అధ్యక్షత వహించారు.

జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ జె. కొండలరావు, శ్రీయుతులు కె. పున్నయ్య, యం. పి., యం. వెంకట్రామయ్య, సి. హెచ్. వెంకటకోటయ్య, జిల్లా విద్యాశాఖాధికారిణి శ్రీమతి షాహజహాన్ బేగం గారలు కూడా ఈ సభలో ప్రసంగించారు.

## కొండాపురం గ్రామానికి విద్యుచ్ఛక్తి

కరీంనగరం జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ టి. హనుమంతరావు మెట్పల్లి తాలూకా కొండాపురం గ్రామంలో విద్యుచ్ఛక్తి సరఫరాకు ప్రారంభోత్సవం జరిపారు. మెట్పల్లి సహకార మార్కెటింగు సంఘం అధ్యక్షులు శ్రీ యం. జగన్మోహనరావు ఈ సందర్భంలో ఏర్పాటైన సభకు అధ్యక్షత వహించారు.

జిల్లా పరిషత్తు అధ్యక్షులు తెలంగాణా ప్రత్యేక అభివృద్ధి పథకాలకు కేటాయించిన బడ్జెటును గురించి వివరించారు. రోడ్డు నిర్మాణం, నీటి సరఫరా పథకం పూర్తికాగలదని హామీ ఇచ్చారు.

## బెజ్జంకి గ్రామంలో విద్యుచ్ఛక్తి

తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు శ్రీ జె. చొక్కారావు ఏప్రిల్ 20 న కరీంనగరానికి 22 మైళ్ళ దూరంలోని బెజ్జంకి గ్రామానికి విద్యుచ్ఛక్తి సరఫరాకు ప్రారంభోత్సవం జరిపారు.

ఈ సభకు జిల్లా కలెక్టరు శ్రీ ఎస్. వి సుబ్రహ్మణ్యం అధ్యక్షత వహించారు.

శ్రీ చొక్కారావు బహిరంగ సభలో మాట్లాడుతూ సామాన్య ప్రజానీకపు జీవన స్థాయిని పెంపొందించడానికి కృషి చేయాలి కాని, అధికారానికి పోటీపడరాదని చెప్పారు. స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచి దేశంలో దారిద్ర్యాన్ని పారద్రోలడానికి మనం కృషి చేస్తున్నాము. అయితే ఈ గమ్య స్థానాన్ని చేరడానికి ఇంకా ఎంతో కృషి చేయవలసి ఉందని అన్నారు. విద్యార్థులను ఉద్దేశించి మాట్లాడుతూ వారు విద్యార్జన పట్ల శ్రద్ధ వహించాలని, సమస్యలన్నింటిని అన్ని కోణాలనుంచి సరిగ్గా పరిశీలించాలని, భవిష్యత్తులో గురుతర బాధ్యతలు వహించడానికి శక్తి సామర్థ్యాలు సంపాదించుకోవాలని ఆయన ఉద్బోధించారు. ఉద్రేకంతో ఏ సమస్యనూ పరిష్కరించలేమనీ, ప్రజా స్వామ్య పద్ధతులద్వారా మాత్రమే వాటిని పరిష్కరించాలని ఆయన చెప్పారు.

గ్రామానికి విద్యుచ్ఛక్తి తెప్పించడానికి కృషిచేసిన సమితి అధ్యక్షుణ్ణి ప్రజలను జిల్లా కలెక్టరు ప్రశంసించారు. కరీంనగరం జిల్లాలో 1970 మార్చి ఆఖరువరకు 350 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడం జరిగింది. 17054 వ్యవసాయ బావులకు, 17344 ఇండ్లు, పారిశ్రామిక అవసరాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడం జరిగిందని ఆయన వెల్లడించారు.

## జిల్లాస్థాయిలో సాంకేతిక సహాయసంస్థ

ప్రతి జిల్లాలో సాంకేతిక సహాయ సంస్థను నెలకొల్పే విషయమై ప్రభుత్వం తీవ్రంగా ఆలోచిస్తున్నదని పరిశ్రమల మంత్రి శ్రీ టి. సి. వెంకన్న వెల్లడిచేశారు. జిల్లాలో పరిశ్రమలు నెలకొల్పదలచుకొన్నవారికి యీసంస్థ నుంచిఅవసరమైన సాంకేతిక సలహాలు, సహాయం లభించగలదని ఆయన చెప్పారు.

గుంటూరులో ఇటీవల రూ. 1.50 లక్షల ఖర్చుతో నిర్మించబడిన ఐస్ ఫ్యాక్టరీకి పారిశ్రామిక వాడలో ప్రారంభోత్సవంచేస్తూ మంత్రి పై విషయాలు చెప్పారు. పరిశ్రమలశాఖాధికారులు ధనవంతులను కలుసుకొని పరిశ్రమలు ఏర్పాటు చేయడంవల్ల కలిగే లాభాలను గురించి వారికి వివరించి చెప్పాలని ఆయన సూచించారు. అధికారులు దీనిని ఒకసవాలుగా తీసుకొని పని చేయాలని ఉద్బోధించారు. "ఈ అవకాశాలను వినియోగించుకొనడానికి డిప్లొమా హోల్డర్లు ఇంజనీర్లు ముందుకు రాకపోవడం చాలా శోచనీయం. పరిశ్రమలు నెలకొల్పడానికి ప్రభుత్వం ఇట్టి వ్యక్తులకు రూ.2 లక్షలు రుణంగా ఇవ్వడానికి సిద్ధంగాఉంది. ఏదో ఒక ఉద్యోగం దొరికితే



హనుమకొండ సమితిలోని ధర్మవరం గ్రామంలో పెనుగాలికిగురైన పెంకుటిల్లు

చాలు అనే మనస్తత్వంవల్ల తృప్తికలగదు. వ్యక్తి సమస్యలకు ఇట్టి దృక్పథం శాశ్వత పరిష్కారం కాజాలదని" మంత్రి చెప్పారు.

బ్యాంకులు చేస్తున్న ఆర్థిక సహాయాన్ని మంత్రి ప్రశంసించారు.

గుంటూరు మునిసిపల్ ఛైర్మన్, ఎం ఎల్ ఎ. అయిన శ్రీ సి. హెచ్. హనుమయ్య యీ సభకు అధ్యక్షత వహించారు.

శ్రీ ఎ. వాసుదేవరావు పారిశ్రామికవేత్తల తరపున మాట్లాడుతూ స్థలాలపైన యాజమాన్యాన్ని సంబంధిత పార్టీలకు సంక్రమింపచేయాలనీ నీటిసరఫరా, రవాణా సమస్యలను వెంటనే పరిష్కరించాలనీ కోరారు.

## పోడూరు సమితిలో మంత్రుల పర్యటన

ఈ ఏప్రిల్ 9వ తేదీన రాష్ట్రసాంఘిక సంక్షేమ శాఖమంత్రి శ్రీ దాసరి పెరుమాళ్లు పశ్చిమ గోదావరిజిల్లా పోడూరు పంచాయితీ సమితిలోని పెనమల్లం, దడిపూడి, ములపర్రు. దేవ గ్రామాలలోని



వర్ధన్నపేట పంచాయతీ సమితిలోవి బొల్లికుంట గ్రామంలో 2–4–70 తేదీన పెనుగాలి వీచినప్పుడు పడిపోయిన మామిడిచెటు.

హరిజన వాడలను సందర్శించి, హరిజనుల స్థితిగతులనుగూర్చి విచారించారు. హరిజనులకు నివేశన స్థలములు మంజూరుచేయుట, మంచినీటి సౌకర్యములు కలుగజేయుట, గృహ నిర్మాణములకు వలసిన ఆర్థికసహాయమును అందజేయుట మొదలగు విషయము లందు ప్రభుత్వము తగిన ప్రాధాన్యత చూపిస్తుందని; ఈ సంవత్స రము హరిజనులకు, తదితర వెనుకబడిన కులాలవారికి నివేశన స్థలములు మంజూరుచేసేందుకుగాను కోటిరూపాయలు కేటాయిం చడమైనదని, యింత ఎక్కువ మొత్తాన్ని లోగడ ఎప్పుడూ కేటా యించడం జరుగలేదని మంత్రి తెలియజేశారు.

ఏప్రిల్ 10వ తేదీన రాష్ట్ర దేవాదాయ ధర్మాదాయశాఖమంత్రి శ్రీ రుద్రరాజు రామలింగరాజు సాంఘిక సంక్షేమ శాఖామంత్రి శ్రీ దాసరి పెరుమాళ్లు ఆచంట సందర్శించారు. ధర్మకార్యాలకు ప్రజలు ముందుకువచ్చినప్పుడు ప్రభుత్వము అన్నివిధాల సహకరించ గల దని శ్రీ రామలింగరాజు తమ ప్రసంగంలో తెలియజేశారు.

ఆదేరోజు మధ్యాహ్నం పండిత విల్లూరుగ్రామ హరిజన వాడలో రూ. 12,000 ఖర్చుతో నూతనముగా నిర్మింపబడే పాఠ శాల భవనమునకు మంత్రి శ్రీ దాసరి పెరుమాళ్లు శంకుస్థాపన చేశారు.

16వ తేదీన రాష్ట్ర పంచాయతీరాజ్ శాఖామంత్రి శ్రీ తోట రామస్వామి, రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖా మంత్రి శ్రీ దాసరి పెరుమాళ్లు ఆచంట గ్రామం విచ్చేసిన సందర్భంలో శ్రీ తోట రామస్వామి తమ ప్రసంగములో మంచినీటి కుళాయిలు అమర్చు కొనే ప్రతిఒక్కరు రు 250 లు చెల్లించిన యెడల అట్టి పథకా లను అమలు జరుపడం సాధ్యపడుతుందని అన్నారు

ఆచంట వేమవరములో నూతనముగా నిర్మింపబడే విజ్ఞాన సమితి భవనానికి శంకుస్థాపన చేస్తూ మంత్రి శ్రీ పెరుమాళ్లు గ్రామస్తులు చూపిస్తున్న ఆసక్తిని కొనియాడారు.

పండిత విల్లూరుల్లో రు. 20,000 లు ఖర్చుతో నూతన ముగా నిర్మింపబడే పాఠశాల భవనానికి మంత్రి శ్రీ రామస్వామి శంకుస్థాపన చేశారు.

## కోదాడులో మార్కెటుయార్డు

మార్కెటింగ్ శాఖా మంత్రి శ్రీ రామచంద్రరావు కళ్యాణి కోదాడులో రూ. 2.25 లక్షల ఖర్చుతో నిర్మించబడనున్న మార్కెటింగు కమిటీ ఆఫీసుకు ఇటీవల శంఖుస్థాపన చేశారు. మార్కెటు ఆవరణలో రైతుల విశ్రాంతి గృహ నిర్మాణానికి శ్రీ జి. యస్. రెడ్డి, ఎం పి. శంకుస్థాపన చేశారు. ఈ సందర్భంలో జరిగిన బహిరంగ సభకు జిల్లాపరిషత్తు అధ్య క్షులు శ్రీ వి. రామలింగా రెడ్డి అధ్యక్షత వహించారు.

రైతులు పండించిన ధాన్యాలను సరసమైన ధరలకు విక్ర యించడానికి ప్రభుత్వం శక్తివంచన లేకుండా మార్కెటింగు సౌకర్యాలు కల్పిస్తున్నదని మంత్రి చెప్పారు. మంచి ట్రాక్టరులు సరఫరా చేయాలని వచ్చిన డిమాండుకు సమాధానమిస్తూ, ఆగ్రో ఇండస్ట్రీస్ శాఖ, వస్తువుల మార్పిడి పద్ధతిపైన ట్రాక్టర్లు దిగుమతి చేస్తున్నదని చెప్పారు. రాష్ట్రంలో ట్రాక్టర్ ఫ్యాక్టరీని నెలకొల్పే విషయమై ప్రభుత్వం ఆలోచిస్తున్నదని ఆయన తెలిపారు. ఇలాంటి ఫ్యాక్టరీ నెలకొల్పినటయితే ఆగ్రో ఇండస్ట్రీస్ మేలురకం ట్రాక్టర్లను సరఫరా చేయగలదని ఆయన చెప్పారు.

## ఉపాధ్యాయుల ఉదార విరాళం

కరీంనగర్ పంచాయతీ సమితి గ్రామాలలో నాల్గవవంతు ప్రజా విరాళం ద్వారా 30 ప్రాథమిక పాఠశాల భవనాలు నిర్మించ బడ్డాయి. సమితిలో పని చేస్తున్న ఉపాధ్యాయులు నాటకాలువేసి, అందుకు విక్రయించిన టిక్కెట్ల ద్వారా డబ్బు ప్రోగు చేశారు నెహ్రూ మెమోరియల్ ఆర్ట్స్ థియేటర్ అధ్వర్యంలో ఈ ఉపాధ్యాయులు నాటకాలు వేసి అమ్మిన టిక్కెట్ల ద్వారా రూ. 25,000లు సేకరించగలిగారు. శ్రీరామనవమి ఉత్సవ సంద ర్భంలో బెజ్జంకి గ్రామంలో జరిగిన బహిరంగ సభలో సమితి అధ్యక్షులు శ్రీ కె. గోపాలరావు, పై విషయాన్ని వెల్లడించారు.

సమితిస్థాయిలో ఉపాధ్యాయులు ఒకనాటక సంఘాన్ని స్థాపిం చారు. తమ తమ విధులను నిర్వహిస్తూ, గ్రామాలలో స్కూలు భవనాలు నిర్మించడానికి ప్రజల విరాళం లభించని చోటలో వారు నాటకాలువేస్తూ వచ్చారు. అభివృద్ధి చెందుతున్న సమాజంలో ఉపాధ్యాయుల సాంఘిక సేవ ప్రశంసనీయమైనదని శ్రీ గోపాల రావు చెప్పారు.

## పల్లేరు ఆనకట్టకు శంకుస్థాపన

శాసనమండలి సభ్యుడు, శ్రీ కె. వెంగళరెడ్డి, యిటీవల పుల్లేరు ఆనకట్ట నిర్మాణానికి శంకుస్థాపన చేశారు. ఆ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ యీ పథకం అమలుకు రు. 3,93,000లు ఖర్చు అవుతాయనీ, యీ ఆనకట్టద్వారా 350 ఎకరాలకు నీటి పారు దల సౌకర్యం లభిస్తుందనీ అన్నారు. గుంటూరు జిల్లా, పిడుగు రాళ్ళ పంచాయతీ సమితిలోని కోనంకి, పిల్లుట్ల గ్రామాలలోని షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలకు చెందిన ప్రజలకు ప్రత్యేకంగా యీ ఆనకట్ట వరప్రసాదం వంటిదని ఆయన అభి వర్ణించారు.

దున్నేవాడికి కౌలుదారీ రక్షణ కల్పించి భద్రత కల్పించ నప్పుడు అధికోత్పత్తిని సాధించడానికి అతను ఉత్సాహం కనబర్చ డని ఆయన పేర్కొన్నారు. సన్నకారు రైతులకు, కౌలుదార్లకు ప్రభుత్వం ఆర్థిక సహాయం అందజేయాలని ఆయన సూచించారు. గుంటూరు జిల్లా భూమి తనఖా బ్యాంకు 1964లో రు. 3 కోట్లు, 1969-70లో 21 కోట్ల మేరకు ఋణాలు మంజూరు చేసిందనీ యీ సంవత్సరం రు. 25 కోట్ల మేరకు ఋణాలు మంజూరు చేయాలని ప్రతిపాదించిందని ఆయన తెలియజేశారు. ఈ ఋణసౌకర్యాల ద్వారా మాత్రమే నాగార్జునసాగర్ ప్రాజెక్టు ఆయకట్టుదారులు తమ భూములను సేద్యయోగం చేసుకోగలిగారని లేని పక్షంలో మరో 20 సంవత్సరాలైనా వారు భూమిని సేద్యయోగ్యం చను కోలేకపోయేవారని ఆయన వెల్లడించారు.

## మచిలీపట్నం రేవు అభివృద్ధి

మచిలీపట్నం రేవు అభివృద్ధికి వర్తమాన సంవత్సరములో రూ. 10 లక్షలు ఖర్చుపెట్టాలని సంకల్పించబడింది. 1970–71లో రూ. 7 లక్షల ఖర్చుతో స్టాండు పంపును ఏర్పాటు చేయడానికి ఆర్.సి.సి. జెట్టి నిర్మించబడుతుంది. విద్యుచ్ఛక్తి సరఫరా, ఏటవాలు రక్షణ పనులు మున్నగునవి అభివృద్ధి పరచబడుతాయి. మచిలీపట్నం రేవును అభివృద్ధి పరచి ఒక స్థలం నుంచి స్టీమర్లలో సరుకులు చేరవేయడానికి గల దూరాన్ని తగ్గించేందుకు రేవుకు సమీపంలో ఓడలు నడపడానికి కనీసం నీటిలోతును ఏర్పాటు చేయడానికి, బార్‌కు స్థిరత్వం ఏర్పాటు చేయడానికి గల ఈ పథకాలన్నింటిని ఎగుమతుల సంఘం సిఫార్సు చేసింది.

## కాకినాడ రేవు

నాల్గవ ప్రణాళికలో కేంద్ర ప్రభుత్వ పథకం క్రింద రూ. 2.51 కోట్ల ఖర్చుతో కాకినాడ రేవును అభివృద్ధి పరచాలని నౌకానిర్మాణ, రవాణా మంత్రిత్వశాఖకు రాష్ట్ర ప్రభుత్వం సిఫార్సు చేసింది. రూ. 2.51 కోట్లకు బదులు ఒకకోటి రూపాయలను కేటాయించడానికి కేంద్ర ప్రభుత్వం అంగీకరించింది. తదనుగుణంగా పథకాలను కుదింపు చేయాలని కూడా రాష్ట్ర ప్రభుత్వాన్ని కేంద్రం కోరింది. ఈ సూచన ప్రకారం చర్య తీసుకోవడం జరిగింది. ఈ విషయంలో కేంద్రం నుంచి అంతిమ నిర్ణయం రాష్ట్ర ప్రభుత్వానికి అందవలసివుంది.

నావికుల సంక్షేమ సంస్థ కొరకు ఈ సంవత్సరంలో రూ. 0.15 లక్షలు ఖర్చు చేయడానికి సంకల్పించబడింది. ప్రణాళిక పథకాల క్రింద రేవులను అభివృద్ధి పరచడానికి రాష్ట్ర ప్రభుత్వం కృషిచేస్తున్నది. దీన్ని దృష్టిలో పెట్టుకొని, మచిలీపట్నం, కృష్ణపట్నం, రేవుల అభివృద్ధికి, రాష్ట్రంలో ఇతర రేవుల విషయమై సర్వేచేయడానికి కేంద్ర ప్రభుత్వ నౌకా నిర్మాణ, రవాణా మంత్రిత్వ శాఖ సిఫార్సు చేసింది.

## పట్టా సర్టిఫికెట్ల పంపిణీ

నల్గొండజిల్లా రామన్నపేట బ్లాకులోని బంజరు భూములకు సంబంధించిన పట్టా సర్టిఫికెట్లను కలెక్టరు శ్రీ రమేష్ గ్రోవర్ మే 6వ తేదీన గుండ్రాంపల్లి గ్రామంలో పంపిణీ చేశారు. 11 గ్రామాలకు చెందిన 356 మంది భూములులేని పేద ప్రజలు 571 ఎకరాల మేరకు భూములను పొందారు.

భువనగిరి సబ్ కలెక్టరు శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, తహశీల్దారు శ్రీ ఏ. ఏ. హఫీజ్ ఈ కార్యక్రమానికి హాజరయ్యారు. అంతకుముందు జిల్లా రెవెన్యూ అధికారి శ్రీ ప్రతాప్ కరణ్, రామన్నపేట బ్లాకులో, ముమ్మర కార్యక్రమం క్రింద 7 గ్రామాలకు చెందిన 130 మంది భూములులేని పేద ప్రజలకు 278 ఎకరాలమేరకు భూముల పట్టా సర్టిఫికెట్లను పంపిణీ చేశారు. మల్కాపురం గ్రామంలో ఈ కార్యక్రమం జరిగింది.



ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తి మండలి అధ్యక్షులు శ్రీ ఎ. కృష్ణస్వామి, మే 6వ తేదీన చేవెళ్ళ తాలూకాలోని కొండపూరు గ్రామంలో విద్యుత్ సరఫరాకు ప్రారంభోత్సవం చేశారు. హైదరాబాదు జిల్లా కలెక్టరు శ్రీ నర్సింగ్‌రాజ్ ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు.

---

## పారిశ్రామికవేత్తగా మారిన కర్షకుడు

నల్గొండజిల్లా, రామన్నపేట పంచాయతీసమితిలోని ఆరూరు గ్రామానికి చెందిన శ్రీ కె. రామిరెడ్డి నూటికినూరు శాతం రైతు. ఐతే పరిశ్రమల విషయాల విస్తరణాధికారి శ్రీ జి. రామలింగారావు ప్రోత్సాహం ఇచ్చిన ఫలితంగా ఆయన తన పొదుపు మొత్తాలను వెచ్చించి పారిశ్రామికవేత్త అయ్యాడు.

రొక్కరూపంలోనూ, వస్తురూపంలోనూ ఆయనకు సాధ్యమైనంత సహాయం లభించింది. జాతీయ లఘుపరిశ్రమల కార్పొరేషను ఆయనకు రూ. 6,000 లు విలువచేసే ఒక యంత్రాన్ని సరఫరా చేసింది. నల్గొండలోని గ్రామీణపరిశ్రమల ప్రాజెక్టువారు రూ. 2,000 లను ఋణంగా ఇచ్చారు. వీటి ఫలితంగా శ్రీ రామిరెడ్డి ఇప్పుడు "చెన్నకేశవస్వామి రంపపుమిల్లు, ఫర్నిచర్ హౌజ్"కు యజమాని.

## సమితి కార్యకలాపాల సమీక్ష

మహబూబ్‌నగర్ జిల్లా అలంపురం పంచాయతీ సమితి సర్వసభ్య సమావేశం ఇటీవల మానోపాడులో సమితి అధ్యక్షులు శ్రీ యన్. రామిరెడ్డి అధ్యక్షతనసమావేశమైంది, వివిధ రంగాలలో జరిగిన కార్యకలాపాల ప్రగతిని సమీక్షచేసింది.

జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ కె. కె. రెడ్డి మాట్లాడుతూ విస్తరణ శాఖాధికారులు రైతులకు స్నేహితులుగా, మార్గదర్శకులుగా ఉండాలని సలహా ఇచ్చారు.

## పశు ప్రదర్శన

నిజామాబాదు పారిశ్రామిక వస్తు ప్రదర్శన నిర్వహణ సంస్థ అధ్వర్యంలో గత ఏప్రిల్ నెలలో పశు ప్రదర్శన నిర్వహించబడింది. ఈ సందర్భంగా మాధాపూర్ వాస్తవ్యులు శ్రీ రాజేశ్వర్‌రావు, కోడూరు వాస్తవ్యులు శ్రీ కె. ఎన్. ఆర్.

కృష్ణయ్యలకు చెందిన ఆబోతులను, శ్రీ సత్యనారాయణకు చెందిన జెర్సీగోవులను ఉత్తమమైనవిగా నిర్ణయించి బహుమతులు యిచ్చారు.

## గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

వరంగల్లు జిల్లా రెవిన్యూ అధికారి, శ్రీ మహమ్మదలీ, గత బుధవారం నాడు పర్కాల్ సమితిలోని నారేడిపల్లిలో విద్యుద్దీకరణకు ప్రారంభోత్సవం చేశారు.

ఈ సందర్భంగా జరిగిన సభలో జిల్లా రెవెన్యూ అధికారి ప్రసంగిస్తూ విద్యుచ్ఛక్తి ద్వారాలభించే ప్రయోజనాలను గూర్చి వివరించారు

సమావేశానికి అధ్యక్షత వహించిన జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ ధర్మారెడ్డి ప్రసంగిస్తూ గరిష్ఠసంఖ్యలో గ్రామాలకు విద్యుచ్ఛక్తి 'సరఫరా చేయడానికి ప్రభుత్వం కృషిచేస్తున్నదనీ తెలంగాణా ప్రత్యేక అభివృద్ధి నుండి ఇందుకై రూ. 60 లక్షలు కేటాయించారని ఆయన వెల్లడించారు



వరంగల్ జిల్లా, హన్మకొండ పంచాయతీ సమితిలోని ఊకల్ గ్రామంలో 25-4-70 తేదీన జిల్లా కలెక్టరు శ్రీ కె ఆర్. వేణుగోపాల్, భూములులేని బీద హరిజనులకు పట్టా సర్టిఫికెట్లు పంపిణీ చేశారు.

## బ్యాంకు రుణాలద్వారా అధిక పంట

ఖమ్మంజిల్లా కొత్తగూడెం పంచాయతీ సమితిలోని పాతపాల్వంచ గ్రామ వాస్తవ్యులు శ్రీ వి నాగభూషణం, శ్రీ వి. వెంకటేశ్వర రావు గారలు కొత్తగూడెంలో హైదరాబాదు స్టేట్ బ్యాంకునుంచి 1969 ఆగస్టులో రూ 5 000లు చొప్పున అప్పుతీసుకొని ఆయిల్ ఇంజను సహాయంతో 15 ఎకరాలు సేద్యం చేసి మిరపపంట పండించారు.

ఈ ఇద్దరూకలిసి 15 ఎకరాలభూమిలో రూ. 8985లు పెట్టుబడిపెట్టారు సకాలంలో ఎరువులు క్రిమిసంహారక మందులు వాడారు. తుఫానువల్ల పంటలు దెబ్బతిన్నప్పటికి వీరు ఎకరానికి 10 క్వింటాళ్ల మిర్చి పండించారు. వారు ఎకరం 1కి. రూ. 689 ల పెట్టు బడికి గాను రూ. 6,000 ల ఆదాయం సంపాదించారు.

## నిమ్నతెగలకు పునరావాస పథకం

వరంగల్లు జిల్లా, ములుగు పంచాయతీ సమితిలో పసరా సమీపంలో నిమ్నతెగల సమిష్టి వ్యవసాయ సంఘం నిమిత్తం 520 ఎకరాల భూమిని కేటాయించారు. రెండు సంవత్సరాల తర్వాత రంగాపూర్ సమీపంలో దయ్యంవాగుపై నిర్మించే ఆనకట్ట ద్వారా పూర్తి విస్తీర్ణానికి నీటిపారుదల సౌకర్యం కల్పించబడుతుంది

గిరిజనులకు 90 యిండ్లు, 32 మంది గిరిజన బాలురకు ఆశ్రమ పాఠశాలలను నిర్మించే పని కూడా యీ పథకంలో చేర్చబడింది.

## వరంగల్లులో గిరిజన సంక్షేమానికి రు. 10-00 లక్షలు

వరంగల్లు జిల్లా, నరసంపేట పంచాయతీ సమితిలోని గురిజాలలో, హరిజన దినోత్సవం సందర్భంగా జరిగిన బహిరంగ సభలో జిల్లా కలెక్టరు శ్రీ కె. ఆర్. వేణుగోపాల్ ప్రసంగిస్తూ హరిజన సంక్షేమానికి ప్రభుత్వం అమలు జరుపుతున్న వివిధ పథకాలను గూర్చి వివరించారు ఈ అవకాశాలను వినియోగించుకొని తమ అభ్యున్నతికి కృషి చేయాలని ఆయన హరిజనులకు ఉద్బోధించారు.

సమితి అధ్యక్షుడు శ్రీ జి. ప్రతాపరెడ్డి ప్రసంగిస్తూ సాధారణ నిధులలో 15 శాతం— అంటే రు. 10,000ల మొత్తాన్ని హరిజన సంక్షేమానికి వినియోగించడం జరిగిందని అన్నారు.

## కొత్త గ్రామానికి శంకుస్థాపన

గత మే నెలలో వచ్చిన పెనుతుఫానులో వరదలకు కొట్టుకొనిపోయిన ఖమ్మం జిల్లా బుచ్చిరెడ్డిపాలెం గ్రామం పునరావాసం కొరకు ఉద్దేశించిన కొత్త గ్రామానికి జిల్లా కలెక్టరు శ్రీ ప్రేమ్ రాజ్ మాథుర్ మే 2వ తేదీన శంకుస్థాపన చేశారు. జిల్లా పరిషత్తు కార్యదర్శి శ్రీ డి. భీమ్‌రావు అధ్యక్షత వహించారు. వరదలవల్ల నష్టపోయిన గ్రామంలోని 62 కుటుంబాలకు పునరావాసం కల్పించే నిమిత్తం ప్రభుత్వం రు 17,750లు ఖరీదుచేసే 8 ఎకరాల స్థలాన్ని సేకరించింది

## జూనియర్ కళాశాలకు విరాళాలు

ఖమ్మం జిల్లా, మధిర పంచాయతీ సమితిలోని శిరిపురానికీ ఆ పరిసర ప్రాంతాలకూ చెందిన పురోగాములైన కర్షకులు ఇటీవల శిరిపురంలో శ్రీ జె సర్వయ్య అధ్యక్షతన సమావేశమై తాము రు. 50,000ల మేరకు విరాళాలు వసూలుచేసి, శిరిపురంలో జూనియర్ కళాశాలను నెలకొల్పడం కొరకు ప్రభుత్వాన్ని అభ్యర్థించడానికి తీర్మానించారు

## హరిజన వాడల్లో మంచినీటి బావులకు మంజూరీ

తూర్పుగోదావరి జిల్లా ముమ్మిడివరం పంచాయతీ సమితి స్థాయీసంఘం ఏప్రిల్ 16న సమితి అధ్యక్షుడు శ్రీ ఎ. చిట్టిబాబు అధ్యక్షతన సమావేశమై కాశనకుర్రు, జగన్నాథపురం, కొండుకూరు, మర్లపల్లి, మూరమళ్ల, నేదునూరు, పొట్టిలంక, సక్కవారిపాలెం గ్రామాలలో హరిజనవాడలలో ఒక్కొక్కదానికి రూ. 1000 ల చొప్పున 10 మంచినీటి బావులను నిర్మించడానికి పథకాలను ఆమోదించింది.

కామినీ హరిజనవాడలో క్రొత్తగా ఎలిమెంటరీ స్కూలు భవనాన్ని నిర్మించడానికి ఈ సంఘం రూ. 12500 లు మంజూరు చేసింది. సమితిలోని కామరగిరి, కాశనకుర్రు, తిల్లకుప్ప, విలాసగడిలంక, పల్లంకుర్రు గ్రామాలలో ఎలిమెంటరీ స్కూలు భవనాలకు కాంపౌండుగోడ నిర్మించడానికి స్థాయీసంఘం రూ 27,900లు మంజూరుచేసింది.

ముక్తేశ్వరం కాలవ పైన కొండుకూరు, కరిగ్రాని రేవులవద్ద రు 30,000 ల ఖర్చుతో రెండు కాలినడకవంతెనలు నిర్మించేందుకు జిల్లా పరిషత్తును అభ్యర్థించాలని ఈ సంఘం నిర్ణయించింది.

## నూజువీడు సమితిలో సీమ పందుల పంపిణీ

స్థానిక శాసన సభ్యులు యం ఆర్. అప్పారావు గారు కృష్ణాజిల్లా నూజువీడు పంచాయతీ సమితి సీమ పందుల పంపకపు కార్యక్రమానికి ఏప్రెల్ 29వ తేదీన ప్రారంభోత్సం చేశారు. ఇటీవల పంచాయితీ సమితి వారు 11 యూనిట్లను అభివృద్ధి పర్చుటకు ఏర్పాట్లు చేసి, ఒక్కొక్క షెడుకు రూ. 300_లు సబ్సిడీ మంజూరు చేశారు. ప్రతి యూనిట్‌లోను ఒక మగ పంది, 5 ఆడపంది పిల్లలు వుంటాయి. 1969_70 సం. లో గన్నవరం బేకన్ ఫ్యాక్టరీ ద్వారా సప్లయి చేయబడిన 23 యూనిట్లలోను 11 యూనిట్లు నూజువీడు సమితికే శాంక్షన్ అయినవి. ఒక్కొక యూనిట్ రు. 300 ల అర్థ విరాళము పై సరఫరా చేయబడినవి.

ఈ సభకు సమితి అధ్యక్షులు శ్రీ అల్ల అప్పారావు అధ్యక్షత వహించారు. సీమపందుల అభివృద్ధి పథకమును గురించి బేకన్ ఫ్యాక్టరీ జనరల్ మేనేజరు శ్రీ యస్.యస్. కృష్ణమూర్తి మాట్లాడారు. పిగ్గరీ డెవలప్‌మెంటు ఆఫీసరు శ్రీ. డి.బి.పి. చంద్రశేఖరరావు పందుల పోషణ, తీసుకొనవలసిన జాగ్రత్త పై మాట్లాడారు. ఆంధ్రప్రదేశ్ పిగర్ బ్రదర్సు అసోసియేషన్ కార్యదర్శి శ్రీ డి. శేషం రాజు తమ అనుభవాలను తెలియచేశారు.

స్థానిక శాసన సభ్యులు శ్రీ యం.ఆర్. అప్పారావు, రెండు యూనిట్ల పిల్లలను రైతులకు అందజేస్తూ, పెంపకపుదార్లకు బ్యాంకులద్వారా ఋణసహాయం వెంటనే అందునట్లు బేకన్ ఫ్యాక్టరీ వారు ఏర్పాటు చేయాలని, ఆ విధంగా చేసిన ఎక్కువమంది రైతులు యీ పథకాన్ని వుత్సాహంతో చేపట్టగలరని అన్నారు.






PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS- HYDERABAD-24
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION AND PUBLIC RELATIONS, ANDHRA PRADESH, HYDERABAD.

